




# అంగన్‌వాడీ వాయిస్

స్వరం మీది - పోరాటం మాది

సామాజిక ప్రజా చైతన్య మాస పత్రిక

సంపుటి - 3 సంచిక - 8 అక్టోబరు - 2018 OCTOBER 2018 వెల : 20/-

లోపలి పేజీల్లో




ఆరోగ్యమే మహాభాగ్యం.....



తుపాను బాధితులకు అండగా....



జై భవానీ... జైజై భవానీ...




గుడ్డు... వెర్రిగుడ్డు



కర్నూలు పీడిగా లీలావతి




సామాజిక ప్రజా చైతన్య మాస పత్రిక

సంపుటి : 3 సంచిక : 8 | ఎడిటర్ : దుద్దె ఉదయభాస్కరరావు | అక్టోబరు 2018

## విషయ సూచిక





రిపోర్టర్స్ :
మేఘనా ఉదయ్
యం. విజయకుమార్
ఎస్. మహ్మద్ రఫీ
ఎస్. కృష్ణమోహన్
బి. వసంత్‌కుమార్

లీగల్ అడ్వయిజర్స్ :
వాసర్ల అమర శ్రీనివాస్, అడ్వకేట్
ఫోన్ : 94405 02230

**EDITORIAL OFFICE :**
Flot No. 201,
Guru Raghavendra Enclave,
Sunkaravari Thota,
ELURU - 534 001, W.G.Dt. A.P.,
Cell : 85007 07439, 94401 41712

Email : anganwadivoice@gmail.com

పత్రికకు సంబంధించి న్యాయపరమైన అంశాలను
ఏలూరు పరిధిలో గల జిల్లా కోర్టులోనే పరిష్కరించుకోవలెను.

OWNER, PRINTER, PUBLISHER AND EDITOR BY DUDDE UDAYABHASKARA RAO, PUBLISHED AT : D NO. 3B-2-51, AMBICA CENTER, WESTERN STREET, ELURU-534 001. W G.DIST., ANDHRA PRADESH. PRINTED AT PRASANTH FLEX PRINTERS, D.NO 23A-6-7, SANKARAMATHAM ROAD, R.R. PET, ELURU-534002, W.G DIST., ANDHRA PRADESH. RNI No.: APTEL 2016/71924

సంపాదకీయం

# ఐసిడిఎస్‌కు సంస్కరణల చికిత్స

నలభై మూడు ఏళ్ళ క్రితం ఏర్పడిన సమగ్ర శిశు అభివృద్ధి సేవా (ఐసిడిఎస్) పథకం పేద ప్రజలకు సేవలందించటంలో గణనీయమైన పాత్ర పోషిస్తుంది. భారతదేశంలో అమలవుతున్న అతి ప్రతిష్ఠాత్మకమైన కార్యక్రమాల్లో ఇది ఒకటి. మాతా శిశు సంక్షేమం ఆరేళ్లలోపు చిన్నారుల కిచ్చే ఆరోగ్యం పోషకాహారం, పూర్వ ప్రాథమిక విద్య తదితర ప్రాథమిక అవసరాలను తీర్చే విధంగా సమగ్ర సేవల రూపంలో సంపూర్ణంగా కేంద్రీకరించిన ఒకే ఒక పథకమిది. ఈ వయస్సులోని పిల్లల అవసరాలు తీర్చకపోతే మానవవనరుల అభివృద్ధి సాధ్యం కాదు. అప్పుడు మిగతా దేశాల సరసన సమున్నత స్థానంలో భారత్‌ని నిలపలేము. దేశ వర్తమాన భవిష్యత్ అవసరాలు తీరడం కష్టమైపోతుంది కాబట్టి ఐసిడిఎస్‌ను సుప్రీంకోర్టు సార్వజనీనం చేయాలని నిర్దేశించింది. అయితే నేడు అంగన్‌వాడీ కేంద్రాలు అధ్వాన నిర్వహణతో గాడితప్పి తీరని అప్రతిష్ట మూట కట్టుకుంటున్నాయి. అంగన్‌వాడీ కేంద్రాల స్థాపన, నిర్వహణ కసరత్తు ఇలా అఘోరించటానికి కారకులెవరని ఇదే సుప్రీంకోర్టు నిలదీసినా పాలకులు దిద్దుబాట పట్టలేక పోయారు. దీనితో ఐసిడిఎస్‌లో పలు అక్రమాలు చోటు చేసుకున్నాయి. ఆరేళ్లలోపు పిల్లలు, కిశోర బాలికలు, గర్భిణీలు, బాలింతలందరికి ఏడాదిలో 300 రోజులపాటు విధిగా పౌష్టికాహారం సమకూర్చాలంటూ 2004లో సర్వోన్నత న్యాయస్థానం నిర్దేశించింది. నేటికి ఆ మేరకు బాధ్యత నిర్వహణ ఎండమావినే తలపిస్తుంది. రాష్ట్ర, జిల్లా స్థాయిలో నిర్దిష్ట ప్రణాళికలు, మండల గ్రామ స్థాయిలో పర్యవేక్షణ కరువైన పర్యవసానంగా అంగన్‌వాడీ కేంద్రాలు అనేకం చిల్లర అంగళ్ళుగా భ్రష్టుపడుతున్నాయి. పిల్లలకు, తల్లులకు అందించాల్సిన బియ్యంలో సింహభాగం అటునుంచి అటే దారి మళ్ళుతున్నాయి. పాలు, కోడిగుడ్లు లాంటివి నిర్వహణ సిబ్బంది, వారిపై అధికారులు, స్థానిక పెత్తందారుల జేబులు నింపుతున్నాయి. కేంద్రాల్లో పిల్లల సంఖ్యను ఇంతలంతలు చేసి దొంగలెక్కల దన్నుతో నల్లబజారుకు సరుకులు తరలిస్తున్న బాగోతాలు రాష్ట్రవ్యాప్తంగా కుప్పలు తెప్పలు సమీకృత శిశు అభివృద్ధి కోసం ప్రభుత్వాలు కోట్లాది రూపాయలు కేటాయింపులు జరుపుతున్నప్పటికి సింహభాగం వ్యయీకరణ బూడిదలో పోసిన పన్నీరు అవుతున్నట్లు అధ్యయన నివేదికలు, సామాజిక తనిఖీలు వెల్లడిస్తున్నాయి. ఇప్పటికి దేశంలో పోషకాహారలేమి నిమిషానికొబిడ్డ ఊపిరిని చిదిమేస్తున్నట్లు భారతీయ శిశు వైద్యుల సంస్థ వాపోతుంది.



అక్టోబరు 2018

జాతీయ అభివృద్ధి అజెండాలో పౌష్టికాహారానికి పెద్దపీట వేయాలంటూ సంబంధిత జాతీయ విధానాన్ని నీతి అయోగ్ ఇదివరకెప్పుడో విడుదల చేసింది. అయినా చర్యలు నామమాత్రమే. సంక్షేమ రాజ్యమంటే గ్రామం నివాస సముదాయాల స్థాయిలో మాతా శిశు ఆరోగ్యం పౌష్టికాహార బాధ్యతల్ని పూర్తిగా అంగన్‌వాడీ కేంద్రాలకు అప్పగించాలని నీతి అయోగ్ అంటుంది. శిశువుల్లో పోషకాహార లోపాలను గర్భిణీ, బాలింతల్లో రక్తహీనతను కనిష్టస్థాయికి తగ్గించేందుకు ఉద్దేశించిన అంగన్‌వాడీలు అక్కడకు రాని చుట్టాలై బంగ్లాదేశ్, శ్రీలంక లాంటి దేశాల సరసన భారత్ వెలతెలా పోవాల్సివస్తుంది. బడ్జెట్‌లో కూడా సమీకృత శిశు అభివృద్ధి కార్యక్రమ నిధుల్లో వేల కోట్ల రూపాయలు కోతపెట్టిన మోదీ ప్రభుత్వం అంగన్‌వాడీ విస్తరణ పునరుద్ధరణలకు సంబంధించి ఉదారంగా స్పందించాలి. ఇంత ప్రతిష్ఠాత్మకమైన కార్యక్రమాన్ని ఎట్టి పరిస్థితుల్లోనూ మునగనీయరాదు. పేద ప్రజల అభ్యున్నతి సాధన కోసం రూపొందించిన ఐసిడిఎస్ అమలులో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల ఉదాశీనతవైఖరి నశించాలి. రోజుకో కొత్త పథకం పెట్టి, ఉన్న పథకాలకు పేర్లు మార్చి ఇంత హడావిడి చేస్తున్న పాలకులు ఐసిడిఎస్‌ను ఎందుకు బలోపేతం చేయటంలేదు. అంగన్‌వాడీలను ప్రజలకు దూరం చేసేందుకు స్వచ్ఛంద సంస్థలకు అప్పగించే యోచనలో పాలకులు ఎందుకు ఉన్నారు? ఐసిడిఎస్‌ను బలహీనపరిచే చర్యలను మానుకోవాలి. పౌష్టికాహారం పంపిణీ ద్వారా మాతాశిశు మరణాలను తగ్గించి వ్యాధి నిరోధక టీకాలు ద్వారా స్వస్థత చేకూర్చి రోదిస్తున్న బాల్యాన్ని తల్లడిల్లుతున్న మాతృత్వాన్ని స్వాంతన పరిచేదిశగా వినూత్న ప్రయత్నాలు చేయాలి. కేంద్రాల్లో ప్రజల భాగస్వామ్యం పెరగాలి. కార్యకర్తల్లో జవాబుదారీతనం పెంచాలి. కార్యక్రమాన్ని అమలుచేస్తున్న ఆరోగ్య మాతాశిశు అభివృద్ధి విభాగాల మధ్య అనుసంధానం పెంచాలి. ఐసిడిఎస్‌లో మెరుగైన ఫలితాలు సాధన కోసం ఆ వ్యవస్థను పునర్వ్యవస్థీకరించాల్సిన అవసరం ఎంతైనా వుంది. శిశు మాతృత్వ దశల్లో ప్రతి ఒక్కరికీ ప్రత్యేక సంరక్షణ సహకారమని వెల్లడించిన ఐక్యరాజ్య సమితి ఆశయం నెరవేరాలి అంటే క్షేత్రస్థాయిలో ఈ శాఖలో సంస్కరణల చికిత్స చేయాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

ఉదయభాస్కరరెడ్డి



# సంరక్షణ ఎక్కడ?

## 'బేటీ బచావో పడావో' పథకం ప్రకటనలకే పరిమితం

## రూ. 199 కోట్లలో రాష్ట్రాలకు వచ్చింది 54.89 కోట్లు

కేంద్రంలోని ప్రధాని నరేంద్రమోదీ నేతృత్వంలోని బీజేపీ సర్కారు పథకాలన్నీ ప్రచారార్భాటమేనని స్పష్టమవుతోంది. 'బేటీ బచావో..బేటీ పడావో' (బీబీబీపీ) పథకం కేవలం ప్రకటనలకు, ప్రచారానికే పరిమితమైంది. బాలికల సమగ్ర అభివృద్ధి, సంరక్షణే లక్ష్యంగా 2015, ఏప్రిల్‌లో ఈ పథకాన్ని కేంద్ర ప్రభుత్వం ఆర్భాటంగా ప్రారంభించింది. పెద్ద ఎత్తున ప్రచార ప్రకటనలనూ విడుదల చేసింది. దేశవ్యాప్తంగా ఎంపిక చేసిన 100 జిల్లాల్లో అమలుచేయాలని నిర్ణయించి, కేంద్ర బడ్జెట్‌లో సుమారుగా రూ.200 కోట్ల నిధులు కేటాయించారు. అయితే పథకాన్ని క్షేత్రస్థాయిలోకి తీసుకెళ్లటంలో దారుణంగా విఫలమైంది. కేటాయించిన నిధుల్లో కనీసం 20 శాతం కూడా రాష్ట్రాలు, కేంద్ర పాలిత ప్రాంతాలు ఖర్చు చేయలేదు. చేసిన ఆ కొద్ది నిధుల వ్యయంలోనూ పెద్ద ఎత్తున గోల్‌మాల్ జరిగింది. బీబీబీపీ పథకం కింద కనీసం రూ.40కోట్లు (దేశం మొత్తం మీద 20 శాతంలోపే) కూడా రాష్ట్రాలు, కేంద్ర పాలిత ప్రాంతాలు ఖర్చు చేయలేదని 'కంప్ట్రోలర్ ఆడిటర్ జనరల్' తీవ్రంగా తప్పుబట్టింది. ఈ పథకంపై కాగ్ రూపొందించిన నివేదికను సమాచార హక్కు చట్టం ద్వారా సేకరించిన సామాజిక కార్యకర్త 'విహార్ దుర్వే' మీడియాకు విడుదలచేశారు. వివరాలు ఇలా ఉన్నాయి. రాష్ట్రాలు నిధులు ఖర్చు చేయకున్నా, యుటిలైజేషన్ సర్టిఫికెట్లు ఇవ్వకున్నా తదుపరి ఏడాదికి నిధులు అందజేయటం తప్పు అని, సవరించిన బడ్జెట్‌తో కేటాయింపులు జరపలేదని 'కాగ్' విమర్శించింది. పథకం అమలు పట్ల కేంద్ర మహిళా, శిశు అభివృద్ధి మంత్రిత్వ శాఖ వ్యవహరించిన తీరు సరిగా లేదని నివేదికలో తెలిపింది.

### రూ.181.34 కోట్ల నిధులు కాగితాలకే పరిమితం

ఈ పథకానికి కేంద్రం 2016-17లో కేటాయించిన నిధులు 192.99 కోట్లు. ఇందులో రాష్ట్రాలకు విడుదల చేసింది రూ. 54.89 కోట్లు. ఇందులో రాష్ట్రాలు, కేంద్ర పాలిత ప్రాంతాలు చేసిన నిధుల వ్యయం కేవలం రూ. 18.65 కోట్లు ఖర్చు చేయని నిధులు రూ. 36.24 కోట్లు. కేంద్రం ఖర్చు చేయకుండా కేవలం కాగితాలకే పరిమితం చేసిన నిధులు రూ. 181.34 కోట్లు. హర్యానా, పంజాబ్, యుపి, మహారాష్ట్ర, జమ్మూకాశ్మీర్, రాజస్థాన్, గుజరాత్, ఢిల్లీ, మధ్య ప్రదేశ్, ఉత్తరాఖండ్ రాష్ట్రాలు నిధుల వ్యయం



లో దారుణంగా విఫలమయ్యాయి. బాలికల జననరేటు ఏ రాష్ట్రాలలో తక్కువగా ఉందో, ఎక్కడైతే స్త్రీ-పురుష లింగభేదం ఎక్కువగా ఉందో ఆ రాష్ట్రాలే 'బీబీబీపీ' పథకం అమలులో చాలా నిర్లక్ష్యం వహించాయి. వచ్చిన నిధుల్లో ఒక్క రూపాయి కూడా ఈ రాష్ట్రాలు ఖర్చుపెట్టలేదు.

### బాలికలపై నేరాలను తగ్గించలేకపోయారు

జాతీయ నేర గణాంకాల బ్యూరో ప్రకారం, ఈ పది రాష్ట్రాలలో బాలికలపై నేరాలు ఎక్కువగా ఉన్నాయి. ఉత్తరప్రదేశ్‌లో అధికంగా నమోదవుతున్నాయి. బాలికలపై జరిగే నేరాలను తగ్గించటంలో 'బీబీబీపీ' పథకం ఏవిధంగానూ ఉపయోగపడలేదని తెలుస్తోంది. ఈ పది రాష్ట్రాలు కాకుండా మిగతా రాష్ట్రాలు తప్పుడు 'యుటిలైజేషన్ సర్టిఫికెట్స్' అందజేసి మరిన్ని నిధులు పొందుతున్నాయి. ఆ రాష్ట్రాలు చేసింది తప్పేనని తెలిసినా, కేంద్ర మహిళా, శిశుఅభివృద్ధి మంత్రిత్వశాఖ ఏమీ చేయలేకపోయింది. 'బీబీబీపీ' పథకం కింద మరుసటి సంవత్సరం బడ్జెట్ నిధులను అందజేసింది. ఇప్పటికే ఎంపిక చేసిన 100 జిల్లాలతోపాటు మరో 61 జిల్లాలకు ఈ పథకాన్ని విస్తరించాలని 2016 జనవరిలో మోదీ ప్రభుత్వం నిర్ణయించింది. ఇందుకోసం కేటాయించిన రూ. 199.99 కోట్లకు అదనంగా మరో రూ. 76 కోట్లు అందజేసినట్టు తెలిసింది. ఆచరణల నిధుల వ్యయంపై కేంద్ర మహిళా, శిశు అభివృద్ధి మంత్రిత్వశఆఖ సరైన పర్యవేక్షణ జరపటంలేదని కాగ్ పేర్కొంది.



# జీవవైవిధ్యంతోనే ఆహార భద్రత

**16 అక్టోబరు వరల్డ్ ఫుడ్ డే**

**"తిండి కలిగితే కండ కలదోయ్**
**కండ కలవాడేను మనిషోయ్"** అన్నాడు గురజాడ.

తిండీ కండే కాదు, ఏ విధమైన అండాదండా లేక జీవస్మృతులుగా బతుకులు భారంగా వెళ్లదీస్తున్న వారెందరో మన మధ్య ఉన్నారు. అసాయతకు వారంతా అసలు సిసలు చిరునామాలు. ఆకలితో ఉన్న మనిషి ఎట్టి పరిస్థితుల్లోను స్వేచ్ఛాజీవి కాలేదు. పేదలకు సరైన తిండి తప్పులు సమకూర్చినప్పుడే నిజమైన నాగరికత ఉన్నట్లు లెక్క. ఆకలి కారణంగా పదేళ్లలోపు పిల్లలు ప్రతి ఏడు సెకన్లకు ఒకరు చొప్పున రాలిపోతున్నారు. ప్రపంచ వ్యాప్తంగా 84 కోట్లమందికి పోషకాహారం అందుబాటులో లేదు. మొత్తంమీద 200 కోట్ల మందికి రోజుకు ఒక్కపూట తిండి కూడా కరవే. మనమంతా 'ఆకలిరాజ్యం'లో ఉన్నామనేందుకు ఇంతకన్నా నిదర్శనం కావాలా?

## సవాలుకు సరైన సమాధానం?

ఆహార సమస్యలపై దృష్టి సారించి, పరిష్కారమార్గాలను సూచించే ఉద్దేశంతో ఏటా అక్టోబరు 16న ప్రపంచ ఆహార దినోత్సవాన్ని నిర్వహిస్తున్న ఐక్యరాజ్యసమితి ఆహార, వ్యవసాయ సంస్థ (ఎఫ్ఎఒ) – 'ఆహార భద్రత కోసం జీవవైవిధ్యం' అనే అంశాన్ని ఈ ఏడాది ప్రచారాంశంగా ఎంచుకొంది. క్రియాశీల, ఆరోగ్యప్రద జీవనం గడిపేందుకు వీలుగా ప్రజలకు నిరంతరం తగినంతగా ప్రామాణిక ఆహారం లభించాలంటే జీవవైవిధ్యం పాత్ర కీలకమని విస్తృత ప్రచారం చేయతలపెట్టారు.

వ్యవసాయానికి ఆహార ఉత్పత్తికి జీవవైవిధ్యం మౌలికావసరం. ప్రజలు వివిధరకాల ఆహార పదార్థాలు, అవాసాలు, వస్తువులపై ఆధారపడిన జీవనయాత్ర సాగిస్తుంటారు. కానీ వారి కారణంగా ఆయన జీవజాతులు, పర్యావరణంపై ఒత్తిడి తీవ్రంగా పెరుగుతోంది. ఫలితంగా అనేక మొక్కలు, జీవులు అంతరించిపోతున్నాయి. ఫలదీకరణకు దోహదపడే కీటకాలు, నేలలో సారం పెంచే సూక్ష్మక్రిములు సైతం నశించిపోతుండటంతో మానవాళి జీవనాధారమైన వ్యవసాయ రంగంపై దుష్ప్రభావం పడుతోంది. దిగుబడి తగ్గి బతుకుబండి మరింత లోతుల్లోకి దిగబడిపోతోంది. దీనికి విరుగుడు జీవవైవిధ్యంతో ఆహార భద్రత సాధించడమే. జనాభాతోపాటు ఆహార అవసరాలూ నానాటికి పెరుగుతున్నాయి. ఈ సవాలును ఎదుర్కోవడం అంత సులభంకాదు. ప్రతికూల వాతావరణ పరిస్థితులను సైతం తట్టుకొని నిలబడగలిగే విభిన్నరకాల, విశిష్ట లక్షణాల మొక్కలను, ఇతరత్రా జీవజాతులను పరిరక్షించుకోవడం, పెంపొందించుకోవడం అత్యవసరం. పర్యావరణ అనుకూల వ్యవసాయ పద్ధతుల ద్వారా ప్రజల ఆహార అవసరాలను తీర్చడమే కాదు – సముద్రాలను, అడవులను, మైదాన ప్రాంతాలను 'బయోడైవర్సిటీ'కి దోహదపడే ఇతర జీవ వ్యవస్థలనూ కాపాడుకోగల వీలుంది. భూ ఉపరితలంలో 40 శాతానికి పైగా వ్యవసాయానికే ఉపయోగిస్తున్న దృష్ట్యా, జీవవైవిధ్యాన్ని కాపాడవలసిన బృహత్తర బాధ్యత రైతులమీదే ఉంది. అధిక దిగుబడినిచ్చే మేలైన విత్తనాలు, తక్కువస్థాయిలో క్రిమిసంహారిణుల ఉపయోగం, సేంద్రియ వ్యవసాయం, పంట మార్పిడి వంటి పద్ధతుల ద్వారా జీవావరణ, పర్యావరణ వ్యవస్థల సమతుల్యతను వారు కాపాడగలుగుతారు. పర్యావరణ పరిరక్షణ చర్యలు, నాణ్యమైన విద్య, విస్తృత పరిశోధన, ప్రభుత్వ మద్దతు కూడా ఉంటేనే జీవవైవిధ్యాన్ని కాపాడటం సాధ్యపడుతుంది. 2015 నాటికి ప్రపంచంలోని అన్నార్తుల సంఖ్యను సగానికి తగ్గించాలని ప్రపంచ ఆహార శిఖరాగ్ర సదస్సు తీర్మానించినప్పటికీ, ఆ లక్ష్యసాధన దిశలో ముందడుగు పడటం లేదు. ఏటికేడాది ఆహార సమస్య తీవ్రరూపం దాలుస్తుండటమే దానికి తార్కాణం. కొరత తీర్చే కల్పతరువు జీవవైవిధ్యమేనన్న వాదనలు వినసొంపుగానే ఉన్నప్పటికీ, దీని ఆచరణాత్మకతమీదే ఫలితం ఆధారపడి ఉంటుందనేది నిర్వివాదం.

జీవవైవిధ్యమంటే ఏమిటి, అది ఏవిధంగా ఉపయోగకరమనే ప్రశ్నలు ఈ సందర్భంగా ఉత్పన్నమవుతున్నాయి. ఒక రైతు విత్తనాలు సేకరిస్తున్నాడనుకొందాం. అవి రకరకాలుగా ఉంటాయి. వేర్వేరు ఆకారాల్లో ఉంటాయి. విభిన్నమైన రంగుల్లో ఉంటాయి. అదే సమయంలో వాటిలో వివిధ విధాల జన్యుసమాచారం ఉంటుంది. ఇదంతా జీవవైవిధ్యమే. భూ, జల, పర్యావరణ వ్యవస్థల్లో విభిన్న జాతులు ఉండటం, ప్రతి జాతిలోను అంతర్గత వైవిధ్యాలు ఉండటాన్ని జీవవైవిధ్యమనే అంటారు. జన్యువుల బహుళత్వం కారణంగా అనేక రకాల ఆహారపదార్థాలు లభ్యమవుతాయి. సంపద పెంపునకే కాకుండా ఆరోగ్య పరిరక్షణకు, పారిశ్రామికరంగానికి, పరిశుభ్రవాతావరణానికి అవి తోడ్పడతాయి. అన్నింటికీ మించి ఆహారభద్రతకు గణనీయంగా



దోహదపడతాయి. తద్వారా ఆకలిపై పోరాటంలో పదునైన ఆయుధాలుగా ఉపయోగపడతాయి.

వ్యవసాయం – మానవాళి చరిత్రలో అంతర్భాగం. మనిషికి జీవవైవిధ్యం తాలూకు స్పృహ కలిగించింది అదే. తాము తిన దలుచుకున్న ఆహార పదార్థాలను ఎంపిక చేసుకొని, ఉత్పత్తి చేసుకోగలిగేది మనుషులు మాత్రమే. అపారమైన జీవజాతుల్లో అణువంత మాత్రమే మనకు అందుబాటులో ఉన్నాయనేది సుస్పష్టం. మొక్కలు, పక్షులు, క్షీరదాలు, క్రిమికీటకాలు సహా కోటీ 36 లక్షల జాతులు ఉండగా, వాటిలో మనకు తెలిసింది మూడు శాతమే. భూగోళం మీద మొత్తం మూడు లక్షల 20వేల వృక్ష జాతులు ఉన్నాయి. వాటిలో 30 వేల రకాలు ఉపయోగకరమైనవి. అందులోనూ ఏడు వేల రకాలే ఆహారంగా వాడదగ్గవి. మనం పెంచుతున్నది మాత్రం 120 రకాలనే. దీన్నిబట్టి మనకు ఆహారంగా ఉపయోగపడే ఎన్ని వనరులు అందుబాటులో లేకుండా పోతున్నాయో అర్థం చేసుకోవచ్చు. మనిషి వ్యవసాయ విజ్ఞానం ద్వారా జీవ వైవిధ్యాన్ని తరతరాలుగా ముందుకు తీసుకెళుతూనే ఉన్నాడు. పూర్తిగా నశించిపోకుండా కొన్ని వేల జీవజాతులను కాపాడుకొంటున్నారు. అయినప్పటికీ విఘాతాలు తప్పడంలేదు. మొదట్లో 10 వేల వరకు జీవజాతులు ఆహారంగా ఉపయోగపడేవి. ఇప్పుడు కేవలం 150 రకాల పంటలే యావత్ ప్రపంచ జనాభాకు సరిపడా ఆహార పదార్థాలను సమకూర్చాల్సి వస్తోంది. అందులోను 80 శాతం శక్తిని 12 పంటలే చేకూరుస్తున్నాయి. మనకు లభిస్తున్న శక్తిలో 60 శాతం వరి, గోధుమ, తృణ ధాన్యాలు, బంగాళదుంపల ద్వారా వస్తున్నదే.

## బయోటెక్నాలజీ కీలకం

ఆర్థికంగా ఎంతో పేదవైన కొన్ని దేశాలు, ప్రాంతాలు జీవ వైవిధ్యం విషయంలో అత్యంత సౌభాగ్యవంతమైనవి. లాటిన అమెరికా ఇందుకు ఉదాహరణ. ప్రపంచంలోని తాగునీటిలో 30శాతం, మొక్కల్లో 55 శాతం, అడవుల్లో 46 శాతం, వ్యవసాయ యోగ్య భూమిలో 23 శాతం, పంట భూమిలో 12 శాతం ఆ ప్రాంతంలోనే ఉన్నాయి. ఈ వనరులను సద్వినియోగ పరుచుకొనకపోవడం వల్ల ఈ ప్రాంతంలో దాదాపు అయిదున్నర కోట్ల మంది పోషకాహార లోపంతో బాధపడుతున్నారు. భారత్, చైనా, సబ్–సహారా ఆఫ్రికా, తూర్పు–ఉత్తర ఆఫ్రికా, ఆసియా – పసిఫిక్ ప్రాంతాల్లో కూడా కొన్ని కోట్ల మంది ఇదే సమస్యతో సతమతమవుతున్నారు. మేలైన, విభిన్న రకాల ఆహార ధాన్యాలు అందుబాటులోనికి వస్తే వారి ఆహార అలవాట్లు, జీవన విధానాలు మెరుగుపడతాయి. జీవ వైవిధ్యాన్ని దెబ్బతీస్తున్న వ్యాపారాత్మక వ్యవసాయ విధానాలను విడనాడే అవకాశాలపైనే ఈ మెరుగుదల ఆధారపడి ఉంది. ప్రపంచ జనాభా ఇప్పటికే 630 కోట్లు దాటింది. 2030 నాటికి మరో 200 కోట్ల మంది జమపడనున్నారు. అందరికీ ఆహారం అందుబాటులో ఉంచడం అప్పుడు మరింత కష్టమైపోతుంది. ఈ సవాలును సమర్థంగా ఎదుర్కోవడంలో జీవ సాంకేతిక శాస్త్రం (బయోటెక్నాలజీ) తోడ్పడగలదని '2003–2004'లో ఆహార వ్యవసాయ పరిస్థితిపై ఇటీవల విడుదల చేసిన నివేదికలో ఎఫ్ఎఒ తెలిపింది.

మొక్కల్లో జన్యుపరమైన పరివర్తనానికి శతాబ్దాలుగా కృషి జరుగుతూనే ఉంది. అందులో భాగమే బయోటెక్నాలజీ ఆవిష్కారం. జీవపదార్థంలోని ఒక నిర్దిష్ట డిఎన్ఎ భాగాన్ని మరో దానిలోకి బదిలీచేసే ప్రక్రియను పరిశోధకులు, శాస్త్రవేత్తలు కనుగొనడం విప్లవాత్మకం. చీడపీడలు, తెగుళ్ళు, కలుపుమొక్కల బారి నుంచి పంటలను కాపాడే కొత్త వంగడాల రూపకల్పన సహా అనేక ప్రయోజనాలు దానివల్ల కలిగాయి. ఆహార పదార్థాల నాణ్యత, పోషక విలువలు పెరగడం, బయోటెక్నాలజీ వల్ల ఒనగూడిన ప్రధాన ప్రయోజనం. అదనపు పంట భూముల అవసరం లేకుండానే పంటల ఉత్పాదకతను మూడింతలు పెంచడానికి బయోటెక్నాలజీ దోహదపడుతుంది. వ్యవసాయ రసాయనాల అవసరాన్ని ఇది తగ్గిస్తుంది. తద్వారా భూ, జల, పర్యావరణ వనరుల పరిరక్షణకు వీలుకలిగిస్తుంది. బయోటెక్నాలజీని సక్రమంగా వినియోగించుకోగలిగితే – జీవ వైవిధ్యం ఆసరాతో ఆహార భద్రతను సాధించడం సులభతరమవుతుంది.

## అంగన్‌వాడీ భవనం ప్రారంభం

పాలకొల్లు మండలం వాలమర్రు గ్రామంలో ఇటీవల జరిగిన గ్రామదర్శిని–గ్రామ వికాసం కార్యక్రమంలో స్థానిక ఎమ్మెల్యే డా. నిమ్మలరామానాయుడు పాల్గొన్నారు. ఈ సందర్భంగా ఏడు లక్షల రూపాయల వ్యయంతో నిర్మించిన అంగన్‌వాడీ భవనం ప్రారంభించారు. ఈ కార్యక్రమంలో తాజా మాజీ సర్పంచ్ వాసా పద్మావతి, గ్రామ పార్టీ కార్యదర్శి తాళ్ళ దానేస్వరరావు, సాలా మనికంట, నారిన నారాయణస్వామి, బండారు లక్ష్మీనారాయణ, దిగమర్తి పెద్దిరాజు, తమ్మా నరసింహారావు, వైస్ ఎంపిపి దిడ్ల రామాంజనేయులు, పాముల రజని, కోటి రాంబాబు, పీతల శ్రీనివాస్, ఉంగరాల నరసింహారావు, కావలి సోమేశ్వరరావు, నిల్లా వీరభద్రరావు తదితరులు పాల్గొన్నారు.

# పోషణ అభియాన్‌లో రాష్ట్రస్థాయి అవార్డు అందుకున్న కమీషనర్



మాతా శిశు ఆరోగ్యం, పౌష్టికాహారలోపం, రక్తహీనత అంశాలపై ప్రజలకు అవగాహన కల్పించటం వివిధ శాఖలను సమన్వయం చేసుకుని ఉత్తమ ఫలితాలు సాధించినందుకు ఆంధ్రప్రదేశ్‌కు పదిపోషణ అభియాన్ పురస్కారాలు లభించాయి. ఇందులో రెండు రాష్ట్రస్థాయి అవార్డులుండటం విశేషం. రాష్ట్ర స్థాయి అవార్డులను ఐసిడిఎస్ స్పెషల్ కమీషనర్ హెచ్ అరుణ కుమార్ ఢిల్లీలో అందుకున్నారు. జాతీయస్థాయిలో సెప్టెంబరు మాసాన్ని పోషణ మాసంగా ప్రకటించి ఈ నెలలో వివిధ ప్రభుత్వ శాఖల సమన్వయంతో మాతా శిశు ఆరోగ్యం, పౌష్టికా హారలోపం, రక్తహీనత అంశాలపై ప్రభుత్వ శాఖల సమన్వ యంతో మాతా శిశు ఆరోగ్యం, పౌష్టకాహారలోపం, రక్తహీనత అంశాలపై రాష్ట్రవ్యాప్తంగా ప్రజల్లో చక్కని అవగాహన కల్పించ టంలో అరుణకుమార్ కీలకపాత్ర పోషించారు. సిబ్బందిని సమ న్వయం చేసుకుని సమిష్టి కృషితోనే రాష్ట్రస్థాయి అవార్డును అందుకున్నారు. జిల్లాస్థాయిలో ఈ గౌరవం విజయనగరం జిల్లాకి దక్కింది. ఆ జిల్లా కలెక్టర్ హరిజవహర్‌లాల్ జిల్లాస్థాయి నాయకత్వ పురస్కారాలను స్వీకరించారు. అలాగే క్షేత్రస్థాయిలో వ్యక్తిగతంగా అద్భుత పనితీరు కనబరిచిన విజయనగరం జిల్లా అంగన్‌వాడీ కార్యకర్త సుంకరి శ్రీలక్ష్మి, కర్నూలు జిల్లా అంగన్ వాడీ వర్కర్ కె సునీత, పి సునీత ఇలా పలు జిల్లాల నుండి అంగన్‌వాడీ కార్యకర్తలకు కూడా ఈ గౌరవం దక్కటం విశేషం.

# వై. సీతానగరంలో గాంధీ జయంతి వేడుకలు





తూర్పుగోదావరి జిల్లా కపిలేశ్వరపురం ప్రాజెక్టు మండపేట సెక్టారు పరిధిలోని ఏడిద సీతానగరం గ్రామంలో ఎస్‌సి ఏరి యాలో ఉన్న అంగన్‌వాడీ కేంద్రంలో గాంధీ జయంతి వేడుక లను ఘనంగా నిర్వహించారు. స్థానిక కార్యకర్త రత్నకుమారి మహాత్మాగాంధీ యొక్క జన్మదిన విశేషాల్ని, మనదేశానికి స్వాతం త్ర్యం సాధించటంలోని మహాత్మాగాంధీ పాత్ర గూర్చి చిన్నారులకు వివరించారు. అహింసామార్గంలో దేశానికి స్వాతంత్ర్యం ఎలా వచ్చిందో అందరికీ అర్థమయ్యేరీతిలో చెప్పారు. అలాంటి మహా నుభావుల జన్మదినాల్ని జరుపుకోవటం మనందరికి దీవెనలుంటా యన్నారు. అంగన్‌వాడీ స్థాయిలోనే విద్యార్థులకు దేశభక్తిపట్ల అవ గాహన కల్గించటంవల్ల చిన్ననాటినుండే సంస్కృతి సంప్రదాయా లపై అవగాహన కలిగి ఉంటారని కార్యకర్త రత్నకుమారి పేర్కొంది. చిన్నారులు అంతా ఉత్సాహంగా పాల్గొని గాంధీజీ చిత్రపటానికి పూలమాలలు వేసి తమ భక్తిని చాటుకున్నారు.

# అంగన్‌వాడీలు వారి ఆరోగ్యంపైనా శ్రద్ధ తీసుకోవాలి

## పోలవరంలో ఉచిత వైద్య శిబిరం ద్వారా ఆరోగ్యసేవలు





ఆకాశంలో సగం అన్న మాట వాస్తవం ఎంతో తెలియదు గాని ప్రభుత్వ సంక్షేమ పథకాల అమలులో అంగన్‌వాడీల పాత్ర 50 శాతం పైబడే ఉంటుందన్నది అక్షరసత్యం. దేశ వ్యాప్తంగా లక్షా 53 వేల మంది అంగన్‌వాడీ కార్యకర్తలు ఉన్నారు. ఆర్థిక స్వాలంబన అంశంలో వీరంతా ప్రత్యేకపాత్ర పోషిస్తున్నారు. అయితే వీరి ఆరోగ్యం గూర్చి పట్టించుకునేవారు ఎవరూ లేరు. మహిళా సాధికారత, ఆరోగ్య సేవలు, సామాజిక సమానత్వం అనేవి ప్రాథమికంగా ప్రభుత్వాల బాధ్యత అయినప్పటికీ ఆ దిశగా పూర్తి స్థాయిలో ఎటువంటి చర్యలు లేవు. ఆరోగ్య సేవల్ని మహిళల చెంతకు చేర్చటానికి వివిధ చట్టాల ద్వారా, విదానపరమైన నిర్ణయాలు ద్వారా అనేక ప్రయత్నాలు జరుగుతున్నప్పటికి ఆరోగ్య సేవల వినియోగంలో పురుషులతో పోలిస్తే మహిళల సంఖ్య చాలా తక్కువ. దానితో వారి ఆరోగ్యంతోపాటు సాధికారత కూడా ప్రశ్నార్ధకంగా మారుతుంది. ముఖ్యంగా గ్రామీణ ఆరోగ్య వ్యవస్థలో కీలక భూమిక పోషించేది అంగన్‌వాడీ కార్యకర్తలే అని చెప్పక తప్పదు. ఆమె పనిచేసే ప్రాంతంలో అందరి ఆరోగ్య విషయాల పైన ఆరా తీసుకుని వారికి చికిత్స అందేటట్లు చూడటం ఆరోగ్యకరమైన జీవనవిధానం. పరిశుభ్రత ఆవశ్యకత, అంటు వ్యాధులు ఇతర వ్యాధులు రాకుండా ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలి అనే విషయంపై ప్రతినిత్యం బోదిస్తూ ఉండే వారి ఆరోగ్య పరిరక్షణ కూడా ముఖ్యమేనని భావించిన పశ్చిమ గోదావరి జిల్లా పోలవరం సిడిపిఒ ఎం సునీల్‌రాజశేఖర్ తన స్వంత సొమ్మును వెచ్చించి మేఘన ఇంటీరియర్ పీపుల్ డవలప్‌మెంట్ ఆర్గనైజేషన్ సహకారంతో తమ ప్రాజెక్టులో పనిచేసే ప్రతి అంగన్‌వాడీ కార్యకర్తకు కార్పొరేట్ తరహాలో వైద్యపరీక్షలు అన్ని ఉచితంగా చేయించారు. ప్రస్తుతం ఉన్న పని ఒత్తిడిలో చాలామంది అంగన్‌వాడీ కార్యకర్తలు అశువులు బాసటమేగాక అనారోగ్య బారినపడి ఆర్థికంగా, సామాజికంగా చాలా నష్టపోతున్నారని గ్రహించిన పి.ఒ సునీల్‌రాజశేఖర్ కొత్త సాంప్రదాయానికి తెరతీసారు. ఉన్నత అధికారులకు కూడా రాని ఆలోచన వీరికి వచ్చి కార్యకర్తలకు ఆరోగ్య సేవలు అందించటం శుభపరిణామమని రాష్ట్రవ్యాప్తంగా ఉన్న ఐసిడిఎస్ సిబ్బంది అభినందనలు తెలిపారు. మెడికల్ క్యాంపు ప్రారంభించటానికి వచ్చిన పోల వరం తహశీల్దార్ సిహెచ్ రవికుమార్ మాట్లాడుతూ సమా జంలో అందరి ఆరోగ్య పోషణ స్థితి గురించి శ్రద్ధ తీసుకుని మాతా శిశు మరణాల నిరోధించటంలో ప్రత్యేక పాత్ర పోషిస్తున్న అంగన్‌వాడీ కార్యకర్తలు తమ ఆరోగ్యంపై కూడా శ్రద్ధ కనపర్చాలని హితవు పలికారు. పోలవరం ప్రాజెక్టు పరిధిలోగల రెండు మండలాలకు చెందిన కార్యకర్తలు ఈ వైద్య శిబిరంలో పాల్గొని బిపి, షుగర్‌తోపాటు గుండె, కంటికి సంబంధించిన పరీక్షలు, ఆర్థో, గైనిక్ విభాగాలకు చెందిన వైద్యులు సైతం వచ్చి పరీక్షలు చేసి ఉచితంగా మందులు అందజేసారు. సమాజంలో నిత్యం నవజాతి శిశువు నుండి గర్భిణీ బాలింతల వరకు పౌష్టిక ఆహారాన్ని అందిస్తూ వారికి





వైద్యపరీక్షలు చేయిస్తూ క్రమం తప్పకుండా టీకాలు వేయిస్తూ నిరంతరం శ్రమించే అంగన్‌వాడీలకు ఈ క్యాంపు ఎంతగానో ఉపయోగపడిందని తహశీల్దార్ సిడిపిఒని అభినందించారు. కార్యక్రమాన్ని ఏర్పాటు చేసిన మేఘన ఎన్‌జిఒ వ్యవస్థాపకులు అంగన్‌వాడీ వాయిస్ మాసపత్రిక ఎడిటర్ డి ఉదయభాస్కర్ మాట్లాడుతూ నదులు..వర్షం...చెట్లు ఎటువంటి స్వార్థం లేకుండానే ప్రజల అవసరాలను తీరుస్తున్నాయని వాటిని స్ఫూర్తిగా తీసుకుని 2010లో ఈ సంస్థ ప్రారంభించి పలు సామాజిక సేవా కార్యక్రమాలు చేపట్టడం జరిగిందన్నారు. మనం మాత్రమే సుఖసంతోషాలతో ఉంటే చాలదు మనతో పనిచేసేవారు కూడా సుఖసంతోషాలతో ఉన్నప్పుడు ఉత్తమ ఫలితాలు సాధించటంతోపాటు సమాజంలో ఆర్థిక అసమానతలు తొలగిపోతాయన్నారు. సృష్టిలో ఎన్నో రకాల జీవ రాశులు ఉన్నా ఒక్క మనిషిలోనే పాపపుణ్యాలు స్వర్గ నరకాలు ఉన్నాయని కాబట్టి బ్రతికి ఉన్న రోజుల్లో పదిమందికి సాయ పడాలని కోరారు. తమసంస్థ ఆధ్వర్యంలో పోలవరం ఐసిడిఎస్ ప్రాజెక్టులో వైద్య శిబిరం ఏర్పాటుకు సహకరించిన పిఒ రాజశేఖర్‌ని తమ సంస్థ తరఫున అభినందించి జ్ఞాపికను ఉదయభాస్కర్ అందజేసారు. మరోవిడత అదే ప్రాజెక్టులో అంగన్‌వాడీ సహాయకులకు ఇదే వైద్య శిబిరాన్ని త్వరలో ఏర్పాటు చేయనున్నట్లు పిఒ చెప్పారు. ఈయనను స్ఫూర్తిగా తీసుకుని పత్తికొండ సిడిపిఒ సావిత్రమ్మ కూడా తమ ప్రాజెక్టు పరిధిలోని కార్యకర్తలకు వైద్యశిబిరం ఏర్పాటు చేసి ఆరోగ్య పరీక్షలు చేయించారు. ఇలాంటి వినూత్న కార్యక్రమం కమీషనర్ స్థాయి అధికారులు ఆలోచనచేసి రాష్ట్ర మంతా పెట్టాలని అంగన్‌వాడీలు కోరుతున్నారు.

# తిరువూరు ప్రాజెక్టుకు ఇన్‌ఛార్జి పి.ఒ.గా సూపర్‌వైజర్?

కృష్ణాజిల్లా తిరువూరు ఐసిడిఎస్ ప్రాజెక్టుకు ఇన్‌ఛార్జి సిడిపిఒగా అదే ప్రాజెక్టులో పనిచేస్తున్న గ్రేడ్-1 పర్యవేక్షకురాలికి ఇన్‌ఛార్జి బాధ్యతలు అప్పగించే యోచనలో ఉన్నట్లు తెలిసింది. మొన్నటి వరకు పనిచేసిన పి.ఒ లలితకుమారి సెప్టెంబర్‌లో పదవీవిమరణ పొందిన విషయం పాఠకులకు విదితమే. ఆమె రిటైర్ అయ్యాక ఆమె స్థానంలో ఎవరికి పూర్తి అదనపు బాధ్యతలు అప్పగించలేదు గాని అంగన్‌వాడీ వర్కర్లు ఆయాల భర్తీ విషయంలో నోటిఫికేషన్ విడుదలకు మాత్రం తాత్కాలికంగా మైలవరం సిడిపిఒ ఒకటి రెండు రోజులు తిరువూరులో పనిచేసారు. అంతే 193 అంగ్‌వాడీ కేంద్రాలు ఉన్న ఈ ప్రాజెక్టు 8 సెక్టార్లుగా విభజించియున్నారు. 5గురు పర్యవేక్షకులు ఈ 8 సెక్టార్లను చూస్తారు. ఈ 5గురిలో ముగ్గురు గ్రేడ్-1 సూపర్‌వైజర్లు కాగా గ్రేడు-2 ఇద్దరు ఉన్నారు. గ్రేడ్-1 ముగ్గురిలో సీనియర్‌కి పిఒ బాధ్యతలు అప్పగించవచ్చునేది సమాచారం. ఇదే ప్రాజెక్టులో వర్కర్‌గా పనిచేసి అంచెలంచెలుగా గ్రేడు-1 స్థాయికి ఎదిగిన ఒకామెకు సిడిపిఒ బాధ్యతలు అప్పగించనున్నట్లుగా తెలిసింది. పక్క ప్రాజెక్టులు అనగా నూజివీడు, మైలవరంలో కూడా ఎవరూ ఎసిడిపిఒలు లేకపోవటం విశేషం. ఐసిడిఎస్‌లో ఇప్పుడున్న పని ఒత్తిళ్ళకి, అధికారుల వేధింపులకు శాశ్వత ప్రాతిపదికన పిఒని నియమించటం మంచిదని అక్కడ సిబ్బందే చెప్పుకుంటున్నారు.

# మహిళలు, ఆరోగ్యం, అభివృద్ధి

ముఖ్య కథనం

**ప్రపంచంలో రక్తహీనత భారతీయ మహిళల్లోనే అధికం. మూడంచెల వ్యూహం ద్వారా రక్తహీనత తీవ్రతను తగ్గించవచ్చు. మహిళల్లో వ్యాధి నిరోధక చర్యల్లో భాగంగా పోషక విలువల లోటు, అధిక పోషక విలువలు, రక్తహీనత, ఎన్‌సిడి పరీక్షలు చేపట్టడం కీలకం. మహిళలు తగినంత పోషకాలు కలిగి వుండి ఆరోగ్యంగా జీవించేందుకు ఈ చర్యలు దోహదపడతాయి. అప్పుడే వారు ఇంటిలో కూడా ఆరోగ్య, పోషకాహార విలువలను పెంచుకోగలుగుతారు. జాతీయాభివృద్ధిలో కీలకపాత్రదారులుగా మహిళలు తమ పాత్ర సమర్థవంతంగా పోషించగలిగినప్పుడే దేశం పూర్తి స్థాయిలో ప్రయోజనం పొందగలుగుతుంది.**

ప్రాచీనకాలం నుంచి మహిళలు..ప్రధానంగా గర్భిణీలు, బాలింతలు మన సమాజంలో పోషక విలువల లోపంతో బాధపడుతున్నారు. ఆహారం తక్కువగా తీసుకోవడం, తరచు గర్భం దాల్చడం, పిల్లలకు పాలిచ్చే దశలో వచ్చే ఇన్ఫెక్షన్ల వల్ల వారిలో పోషకాహారలోపం, రక్తహీనత ఏర్పడుతున్నాయి. గర్భిణీల్లో పోషకాహార లోపం, రక్తహీనత కారణంగా పుట్టే పిల్లలు ప్రమాణాల కన్నా తక్కువ బరువుంటున్నారు. కొత్త శతాబ్దిలో కూడా పోషక విలువల లోపం, రక్తహీనత ప్రధాన పోషకాహార సమస్యలుగా కొనసాగుతున్నా పట్టణ, గ్రామీణ ప్రాంతాలు రెండింటిలోనూ మహిళలు పోషకాహారం తీసుకోవ దం గతంతో పోల్చితే విశేషంగానే పెరిగింది. పోషకాహారం అవసరాన్ని మించి తీసుకోవడంవల్ల ఇతర ఆరోగ్య సమస్యలు ముంచు కొస్తున్నాయి. మహిళల్లో పోషక విలువల లోపంతో ముడిపడి వున్న మూడు రకాల సమస్యలు (అవసరానికి తగినంతగా పోషకాహారం తీసుకోకపోవడం, అవసరాన్ని మించిన పోషకాహారం తీసుకోవడం, రక్తహీనత), వాటివల్ల ఆరోగ్యానికి ఏర్పడుతున్న ముప్పు వంటివి సమూలంగా చర్చిం చడం ఈ వ్యాసం ప్రధాన లక్ష్యం. దీనికితోడు ఈ మూడు రకాల సమస్యలను త్వరితంగా గుర్తించడం, వాటిని సమర్థ వంతంగా నిర్మూలించడం, కుటుంబంలోను, జాతి అభివృద్ధి లోను మహిళల పూర్తిస్థాయి సామర్థ్యాలు వినియోగంలోకి తేవడానికి ఈ నివారణ చర్యలు ఏవిధంగా దోహదపడతాయి వంటి అంశాలను కూడా ఈ వ్యాసంలో చర్చిద్దాం.



## మహిళలు ఆహారాపు అలవాట్లు

జాతీయ పోషకాహార పర్యవేక్షణ బ్యూరో (National Nutrition Monitoring Bureau- ఎన్‌ఎన్‌ఎంబి) 1979 నుంచి 2012 సంవత్సరాల మధ్య గ్రామీణ ప్రాంతాల్లో నిర్వ హించిన సర్వేల ప్రకారం స్వల్పంగానే అయినప్పటికీ కాయ ధాన్యాల వినియోగం మహిళల్లో నిలకడగా తగ్గుతూ వచ్చిందని తేలింది. పప్పులు తీసుకోవడం 1997 వరకు తగ్గినప్పటికీ ఆ తర్వాత పరిస్థితిలో మార్పు వచ్చింది. అయితే కొవ్వు పదార్థాలు, నూనెల వినియోగం మాత్రం స్వల్పంగానే అయినా ఒక మోస్త రుగా పెరిగింది. కానీ, కూరగాయలు ప్రత్యేకించి ఆకుకూరల వినియోగం మాత్రం ప్రమాణాల కన్నా తక్కువగానే ఉంది. మహిళల్లో ప్రోటీన్లు, సూక్ష్మపోషకాలు అవసరానికి కావలసినంత అందుబాటులోకి రావాలంటే పప్పులు, కూరగాయల వినియోగం పెరగాలి. ఇక గుడ్లు మినహా పశువుల నుంచి అందే ఆహార వినియోగం (కోడిమాంసం, ఇతర మాంసాలు, చేపలు వంటివి) కొన్ని సంవత్సరాలుగా ఏ మాత్రం పెరగలేదు. ప్రధానంగా శాఖాహారులు, మాంసాహారుల ఆహార వినియోగంలో పెద్దగా మార్పు ఏదీ కనిపించలేదు. మాంసాహారులు వారానికి లేదా 15 రోజులకి ఒకసారిమాత్రం స్వల్ప పరిమాణంలో మాంసా హారం తీసుకుంటున్నారు.

## శారీరక శ్రమ లేదా వ్యాయామం

1950, 1960 దశకాల్లో రోజువారీ ఇంటి పనుల ద్వారా శారీరక శ్రమ ఉండేది. మంచినీరు, పశుగ్రాసం కోసం దూర ప్రాంతాలకు నడిచి వెళ్ళాల్సివచ్చేది. అలాగే కాలానుగుణంగా



జరిగే వ్యవసాయ కార్యకలాపాల్లో కూడా శ్రమ ఉండేది. ఒక ప్రాంతం నుంచి మరో ప్రాంతానికి బాగా నడవాల్సి వచ్చేది. కాని వారు తీసుకునే ఆహారం ఈ శ్రమకి తగినంతగా ఉండేది కాదు. మహిళల్లో ఆ రోజుల్లో పోషక విలువల లోపం అత్యధికంగా ఉండటానికి ప్రధాన కారణాల్లో ఇదొకటి. అయితే యంత్రాలతో నడిచే వివిధ సాధనాల ద్వారా రవాణా సదుపాయం మెరుగుపడడంతో నడక బాగా తగ్గిపోయింది. అలాగే ఇంధనం, నీటి లభ్యత పెరగడం వల్ల ఈ కార్యకలాపాలతో ముడిపడి ఉన్న శారీరక శ్రమ కూడా తగ్గింది. ఇడ్లీ, దోశ పిండి రుబ్బుకోవడానికి, బట్టలు ఉతికేందుకు, పాత సామగ్రి తోముకునేందుకు వివిధ రకాల యాంత్రిక సాధనాలు అందుబాటులోకి రావడంతో మధ్యతరగతి మహిళల్లో ఎక్కువ మంది వీటిని ఉపయోగిస్తున్నారు. ఫలితంగా ఇంటి పనులతో ముడిపడివున్న శ్రమ గణనీయంగా తగ్గింది. ఇక టివిలు, ఇతర డిజిటల్ సాధనాల ద్వారా వినోదం అన్నిచోట్లా అందు బాటులోకి రావడంతో హాయిగా కూర్చుని ఆ కార్యక్రమాలు వీక్షించేందుకు అధిక సమయం వెచ్చిస్తున్నారు. ఫలితంగా కాలినడక వ్యవధి గణనీయంగా తగ్గింది. పట్టణ ప్రాంతాల్లోను, ఎన్ఎన్ఎంబి గ్రామీణ ప్రాంతాల్లో నిర్వహించిన సర్వే ప్రకారం 1990 దశాబ్ది మధ్యకాలానికి మహిళల్లో అధిక శాతం మంది కూర్చున్న చోటు నుంచి కదలకుండానే ఉండిపోతు న్నారు. బరువు, కండ రాలు, ఎముకలు, జాయింట్లు ఆరోగ్యంగా వుండి, కూర్చుని వుండడం వల్ల వస్తున్న జీవనశైలి వ్యాధులను నివారించాలంటే మధ్యస్థమైన శారీరక శ్రమ అవసరం. ప్రతీ ఒక్క మహిళ ఒక మోస్తరుగా ప్రాధాన్యతా చర్యగా శారీరక వ్యాయామం చేపట్టాల్సిన అవసరం ఉంది. రోజుకి కనీసం 30 నుంచి 45 నిమిషాల పాటు నడవడం చాలా తేలికైన, అందరికీ సాధ్యమైన పని. ఒకేసారి అంత సమయం వెచ్చించలేకపోతే మూడు నాలుగు విడతలుగా 10 నుంచి 15 నిమిషాల వంతున నడవడం చాలామంచిది.

## ఆర్థిక వృద్ధి, శక్తి అందించే ఆహారాల వినియోగం

1960 నుంచి 1990 సంవత్సరాల మధ్యకాలంలో భారత ఆర్థిక వ్యవస్థ కాస్తంత మందగమనంలోనే ఉన్న కొత్త శతాబ్దిలో వేగం పుంజుకుని త్వరితగతిన అభివృద్ధి చెందుతున్న ఆర్థిక వ్యవస్థల్లో ఒకటిగా నిలిచింది. అంతర్జాతీయ అనుభవాలను పరిగణనలోకి తీసుకుంటే వర్ధమానదేశాలు త్వరితవృద్ధి క్రమంలో అడుగుపెట్టిన నాటినుంచి శక్తిని అందించే ఆహార పదార్థాల వినియోగం ప్రధానంగా మాంస వినియోగం పెరుగుతూ వచ్చింది. 2004-05స్థిరధరల కింద ఆర్థికాభివృద్ధి, శక్తి అందించే ఆహార పదార్థాల వినియోగంపై గ్రామీణ, పట్టణ ప్రాంతాల్లో నేషనల్ శాంపిల్ సర్వే సంస్థ నిర్వహించిన సర్వేల ప్రకారం




గత మూడు దశాబ్దాల్లో శక్తి అందించే ఆహారపదార్థాల వినియోగం గణనీయంగా తగ్గింది. ఎన్ఎన్ఎంబి నిర్వహించిన సర్వేల్లో కూడా ఇదే తేలింది. తమలో శారీరక శ్రమ గణనీయంగా తగ్గించదని గుర్తించిన భారతీయులు స్వచ్ఛందంగానే ఇలాంటి ఆహార వినియోగం తగ్గించేసుకున్నారు. త్వరిత ఆర్థిక పరివర్తన సాధిస్తున్న వర్ధమాన దేశాలతో పోల్చితే పరిమితిని మించిన పోషకాహార రేట్లు నింపాదిగా పెరుగుతూ వస్తున్నాయి.

## మహిళల్లో పోషక విలువల స్థితి

ఎన్ఎన్ఎంబి 1975 నుంచి 2012 సంవత్సరాల మధ్య కాలంలో నిర్వహించిన పలువిడతల సర్వేల ప్రకారం మహిళల్లో పోషకాహారం లోటు 52 శాతం నుంచి 33 శాతానికి తగ్గింది. అదే సమయంలో అవసరాన్ని మించిన పోషకాహారం స్వీకరించే ధోరణి 3 శాతం నుంచి 16 శాతానికి పెరిగింది. ఎన్ఎఫ్హెచ్ఎస్ 2,3,4 గణాంకాల ప్రకారం పోషకవిలువల కొరత నిలకడగా తగ్గుతూ 1998, 2015 సంవత్సరాల మధ్యకాలంలో పరిమితిని మించి పోషకాహారం తీసుకోవడం నిలకడగా పెరిగింది. పోషకాహార లోటు తగ్గుతున్నా పరిమితిని మించి పోషకాహారం తీసుకునే ధోరణులు పెరుగుతూ ఉండడం కూడా ఆందోళనకరమైన అంశమేనని అంటున్నారు. సాధారణ పోషకాహార విలువలున్న మహిళల సంఖ్య 60 శాతంగా స్థిరంగా ఉండిపోయింది. మహిళల్లో పోషక విలువల స్థితి వయసునుబట్టి మారుతూ ఉంటుంది. 20 సంవత్సరాల వయసులో ఉన్నవారిలో పోషకాహార లోటు అధికంగా ఉంది. ఈశాన్య, తూర్పు ప్రాంతాల్లో కూడా పోషకాహారం లోటు అధికంగా ఉంది. తక్కువ బరువుతో జన్మించిన మహిళల్లో కూడా ఈ లోటు పెరుగుతూ వస్తోంది. సమీకృత శిశిఅభివృద్ధి పథకం(ఐసిడిఎస్) కింద ప్రభుత్వం గర్భిణీలందరికీ ప్రసూతి సంరక్షణ సదుపాయాలు అందుబాటులో ఉన్నాయి. ఇదే సర్వీసులకింద వారికి గర్భిణీగా వున్న సమయంలో ఇంటికి తీసుకెళ్ళి ఉపయోగించుకునేందుకు రేషన్



ఇస్తున్నారు. పోషకాహార లోపంతో బాధపడుతున్న మహిళలు, గర్భిణీగా ఉండగా తక్కువ బరువున్న మహిళలకు ఇంటివద్దనే ఉపయోగించుకోగల విధంగా అనుబంధ పోషకా లను కూడా క్రమం తప్పకుండా అందిస్తున్నారు. ఈ కారణంగా గర్భిణీగా వుండే సమయంతో తగినంతగా బరువు పెరగడం, ప్రమాణాల కన్నా తక్కువ బరువులో వుండే శిశువుల జననం పరిస్థితులు మెరుగుపడవచ్చు. వయసు పెరుగుతున్న కొద్దీ మహిళల్లో పరిమితిని మించి పోషక విలువల వినియోగం రేటు నిలకడగా, గణనీయంగా పెరుగుతోంది. దేశంలోని దక్షిణ, పడమటి ప్రాంతాల రాష్ట్రాల్లో పరిమితికి మించి పోషకాహార వినియోగం అధికంగాఉంది. గత కొన్నేళ్లుగా మహిళల్లో శక్తినందించే ఆహారం తీసుకోవడం ఏమాత్రం పెరగలేదు. కాని శారీరక శ్రమ గణనీయంగా తగ్గింది. ఈ రకంగా చూసినా శారీరక శ్రమ తగ్గడం కూడా మహిళల్లో పోషకాహారం రేటు అధికంగా ఉంచడానికి కారణం కావచ్చు. అవసరాన్ని మించి పోషకాహార రేటు ఉండడం వల్ల రక్తపోటు, మధుమేహ వంటి జీవనశైలి వ్యాధుల (ఎన్‌సిడి) రిస్క్ పెరిగి పోతోంది. ఈ కారణాలన్నింటినీ పరిగణనలోకి తీసుకుంటే పోషకాహారం రేటు అధికంగా ఉండే స్థితిని సత్వరం గుర్తించి నివారణ, సమర్థవంతంగా పోషక విలువల నిర్వహణ చర్యలు చేపట్టడం తప్పనిసరి.

## అంటువ్యాధులు కాని జబ్బులు - ఎన్‌సిడిలు

- ✦ తొలి దశలోనే గుర్తించవచ్చు (గుర్తించడంలో జాప్యం అయితే క్రమం తప్పకుండా పర్యవేక్షణ కొరవడుతుంది.
- ✦ జీవించి ఉన్నంత కాలం జీవనశైలిలో మార్పులు చేసుకుంటూ ఉండడం అవసరం (అది అంత తేలిక కాదు)
- ✦ జీవించినంత కాలం ఔషధాలు వినియోగిస్తూనే ఉండాలి (వ్యయంతోను, కట్టుబాటుతోను కూడుకున్న అంశం)
- ✦ ప్రారంభదశలోనే త్వరితంగా గుర్తించకపోతే దీర్ఘకాల గుండె, మెదడు, మూత్రపిండాలు, కంటివ్యాధులకు దారితీయవచ్చు.

ఈ అంశాలన్నింటినీ పరిగణనలోకి తీసుకుని మహిళలు క్రమం తప్పకుండా వైద్య పరీక్షలు చేయించుకోవడం తప్పనిసరి.

## మహిళలకు ఆరోగ్య విద్య

- ✦ అనవసర బరువు పెరగడం హానికరం.
- ✦ అవసరాన్ని మించిన పోషకాలుంటే రక్తపోటు, హృద్రోగ సమస్యలు, మధుమేహం రిస్క్ ఉంటుంది.
- ✦ 40 సంవత్సరాల వయసు నుంచే వ్యాధులు రావచ్చు.
- ✦ ఈ వ్యాధులన్నీ ప్రారంభదశలో గుర్తించదగినవే.
- ✦ క్రమంతప్పకుండా ఆరోగ్య పరీక్షలు చేయించుకోవడం వల్ల ఈ వ్యాధులను ప్రారంభదశలోనే గుర్తించి సరైన చికిత్స ప్రారంభించవచ్చు.
- ✦ 30 సంవత్సరాల వయసు పైబడిన మహిళలందరూ ఏడాదికి ఒకసారైనా వైద్య పరీక్షలు చేయించుకుని తీరాలి.
- ✦ ఎన్‌డిసిలను ప్రారంభదశలోనే గుర్తించి సమర్థవంతమైన చికిత్స తీసుకోవడం తక్కువ ఖర్చుతోనే జరిగే పని.
- ✦ ఈ వ్యాధులను ప్రారంభదశలోనే గుర్తించి సరైన, నివారణ చర్యలు తీసుకోవడం వల్ల జీవన నాణ్యత, జీవించే కాల పరిమితి గణనీయంగా పెరుగుతుంది.

చాలామంది మహిళలకు ప్రసూతి సంరక్షణ గురించి తెలుసు. చాలామంది ఇందులో భాగంగా క్రమం తప్పకుండా తమ బరువు చూసుకుంటూ రక్తపోటు పర్యవేక్షించుకుంటూ రక్తహీనత, మధుమేహ పరీక్షలు చేయించుకుంటూ ఉంటారు. ఈ సమస్యలకు సరైన సమయంలో చికిత్స పొందినట్లయితే తల్లి, శిశువు కూడా క్షేమంగా ఉంటారని కూడా వారికి తెలుసు. కాని ప్రసవానంతరం వారు ఎలాంటి ఆరోగ్య సంరక్షణ చర్యలు తీసుకోరు. అలాగే 40వ పడిలో పడిన మహిళలు తమ బరువును నిర్లక్ష్యం చేస్తూ వుంటారు. మెనోపాజ్ వల్లనే తాము బరువు పెరుగుతున్నామని అనుకుంటూ ఉంటారు.

అనవసరమన బరువు అత్యంత హానికరమని ఆరోగ్య విద్యకు సంబంధించిన పాఠ్యపుస్తకాల్లో సుస్పష్టంగా ఉంది. ఇలాంటి వైపరీత్యాన్ని సత్వరం గుర్తించేందుకు, జీవనశైలి వ్యాధులు రాకుండా నిరోధించుకునేందుకు నిర్దిష్ట కాలవ్యవధిలో వైద్య పరీక్షలు చేయించుకుంటూ ఉండేలా వారిలో చైతన్యం పెంచేందుకు అన్ని రకాల ప్రచార సాధనాలు ఉపయోగించాలి. ప్రస్తుత మాతృ, శిశుసంరక్షణ కేంద్రల్లో నిర్వహిస్తున్న వైద్యపరీక్షలు గ్రామాలు/వార్డు స్థాయిల్లో కూడా నిర్వహించే ఏర్పాట్లు చేయాలి. పిల్లలకి వ్యాధి నిరోధక టీకా మందులు ఇస్తున్న తరహాలోనే మహిళల ఆరోగ్య సంరక్షణకు కూడా ఒక షెడ్యూల్ రూపొందించాలి. అవసరానికి మించిన పోషకాహార విలువలు కలిగి ఉండడం, ఎన్‌సిడి గుర్తింపు పరీక్షలు అందుబాటులో ఉండడం వంటి అంశాలపై సమాచారం అందుబాటులో వుంచాలి. ఇలాంటి సమాచారం ఎంత విస్తృతంగా అందుబాటులో వుంటే మహిళలు అంతగా ఆ సేవలు ఉపయోగించుకోగలుగుతారు. అన్ని స్థాయిల్లోను మహిళలకు వ్యాధినిరోధక ఆరోగ్యసంరక్షణ అందుబాటులో ఉంచడంలో భాగంగా అవసరాన్ని మించిన పోషకాహార విలువలు, ఎన్‌సిడిలకు సంబంధించిన పరీక్షలు అందుబాటులోకి తెచ్చే ప్రయత్నం చేయాలి. అప్పుడే

మనం ఇలాంటి వ్యాధులు ప్రబలడాన్ని తగ్గించి ఎన్‌సిడి కారణంగా చిన్న వయసులోనే మరణాల సంఖ్యను ప్రపంచ ఆరోగ్య సమ్మేళనం నిర్దేశించిన లక్ష్యాలకు కుదించగలుగుతాం.

## మహిళల్లో రక్తహీనత

ప్రపంచంలో రక్తహీనత అధికంగా ఉన్న వారిలో భారతీయ మహిళలే ముందు వరుసలో ఉన్నారు. వంద కోట్లకు పైబడిన జనాభాలో ప్రపంచంలోనే అధిక శాతం మంది రక్తహీనత రోగులు భారత్‌లోనే ఉన్నారు. భారతదేశంలో రక్తహీనత ఇంత స్థాయిలో ఉండడానికి కారణాలివే...

- ✦ ఆహారం సరైనంత తీసుకోపోవడం, ఐరన్, ఫోలిక్ యాసిడ్ తగినంతగా లేకపోవడం.
- ✦ ఫైటేట్ ఫైబర్లే అధికంగా ఉండే భారతీయ ఆహారంలో ఐరన్ తగినంతగా అందుబాటులో లేకపోవడం, ఇది ఐరన్, ఫోలిక్ యాసిడ్ లోపానికి దారితీస్తోంది.
- ✦ మలేరియా, మలంలో పురుగుల కారణంగా అత్యధికంగా రక్తం నష్టపోవడం.

గర్భిణీలలో రక్తహీనత ప్రసూతి సమయంలో శిశువు తక్కువ బరువుకి కారణం అవుతుంది. గత దశాబ్ది కాలంలో రక్తహీనత తగ్గినా ఇంకా చాలామంది మహిళల్లో రక్తహీనత ఉంది. దక్షిణ, పడమటి రాష్ట్రాలకన్నా ఈశాన్య, తూర్పు ప్రాంతాల్లోనే రక్తహీనత అధికంగా ఉంది. భారతదేశంలో శైశవ దశ నుంచే రక్తహీనత ప్రారంభం అవుతోంది. బాల్యంలో అది కొనసాగుతూ యుక్త వయసు వచ్చే సమయానికి మరింత పెరిగి గర్భిణీ సమయం లోను, వయసు పైబడుతున్న కొద్ది తీవ్రరూపం దాల్చుతుంది. పోషకాహార లోపంతో బాధపడుతున్న వారే కాకుండా అవసరానికి మించిన పోషకాహార విలువలున్న వారిలో కూడా రక్తహీనత ఉంటోంది. ఈ రక్తహీనతను సత్వరం తగ్గించేందుకు తగుచర్యలు తీసుకోవడం అవసరం. ఇందుకు ఈ దిగువన సూచించిన మూడంచెల వ్యూహం అనుసరించవచ్చు.

- ✦ ఇళ్లలో ఉపయోగించే ఆహారంలో ఐరన్ అధికంగా ఉండేలా చూసుకోవడం, అందుకు తగినంతగా ఆహార పదార్థాల్లో వైవిధ్యం ఉండేలా చూడడం, ఐరన్‌తో కూడిన అయోడైజ్డ్ ఉప్పు వినియోగం.
- ✦ మహిళలకు ఐరన్, ఫోలిక్‌యాసిడ్ సప్లిమెంట్లు అందించడం.
- ✦ మహిళలు ఎలాంటి వైద్య పరీక్షలకు వచ్చినా రక్తహీనతను గుర్తించే పరీక్షలు నిర్వహించి తగు చికిత్స అందించడం.
- ✦ ఈ చర్యలు రక్తహీనతను గణనీయంగా తగ్గించి రక్తహీనత తగ్గింపు విషయంలో నిరంతర అభివృద్ధి లక్ష్యాలు (ఎస్‌డిజి) చేరుకునేందుకు వీలు కల్పిస్తాయి.

మహిళల్లో పోషకాహార లోపం కారణంగా రక్తహీనత పేదరికంతో అల్లాడిన గత శతాబ్దిలో సహజం. ఇదే మహిళల్లో ప్రధాన పోషకాహార సమస్యగా ఉంది. కాని కొత్తశతాబ్దిలో కూడా పోషకాహార లోపం, రక్తహీనత అధికంగానే ఉన్నాయి. దీనికి తోడు గ్రామీణ, పట్టణ ప్రాంతాలన్నింటిలోనూ అన్ని వర్గాల మహిళల్లోనూ అవసరానికి మించి పోషక విలువలు ఉండడం కూడా పెగింది. శారీరక శ్రమ గణనీయంగా తగ్గడమే ఇందుకు ప్రధాన కారణం. మహిళల్లో పోషకాహార స్థితి వయస్సుతో పాటు మారుతూ ఉంటుంది. 20వ దశకంలో ఉన్న మహిళల్లో పోషక విలువల లోటు అధికంగాఉంది. శైశవ దశలో తక్కువ బరువుండడం మహిళల్లో పోషక విలువల లోటుకు ప్రధాన కారణం. ప్రసూతి సంరక్షణలో భాగంగా మహిళలు బరువు పెరుగుతూ ఉంటారు. ప్రధానంగా ఆహార భద్రత తగినంతగా లేని కుటుంబాల్లోనే పోషక విలవలతోపాటు, జనన సమయంలో తక్కువ బరువు సమస్య అధికంగా ఉన్నట్టు గుర్తించిఇంటికి తీసుకెళ్ళి ఉపయోగించే ఆహార సప్లిమెంట్లను క్రమం తప్పకుండా అందిస్తున్నారు. ఇది జనన సమయంలో శిశువు తక్కువ బరువు కలిగి ఉండడాన్ని తగ్గిస్తుంది. కాని వయసు పెరుగుతున్న కొద్ది మహిళల్లో అవసరానికి మించిన పోషకవిలువలు ఉంటున్నాయి. దేశంలోని దక్షిణ, పశ్చిమ ప్రాంతాల్లో ఈ సమస్య అధికంగా ఉంది. ఇలా అవసరాన్ని మించిన పోషక విలువల వల్ల ఎన్సిడిలు ప్రబలిపోతున్నాయి. ప్రారంభ దశలోనే ఎన్‌సిడి (Non Communicable Diseases) లను గుర్తించవచ్చు. క్రమం తప్పని పరీక్షల ద్వారా మాత్రమే దీన్ని గుర్తించడం సాధ్యం. మహిళల్లో ఆరోగ్య విద్యకు సంబంధించిన సమాచార పుస్తకాలు అనవసర బరువు హానికరం అని చెబుతున్నాయి. ఇలాంటి పరిస్థితిని నివారించుకోవాలంటే ప్రారంభ సమయంలోనే ఎన్‌సిడిలను గుర్తించాలి. ఎన్‌సిడిలకు సంబంధించిన సమాచారం అన్నిరకాల ప్రసార, ప్రచార సాధనాల ద్వారా అందుబాటులో ఉంచాలి. ప్రపంచంలో రక్తహీనత భారతీయ మహిళల్లోనే అధికం. మూడంచెల వ్యూహం ద్వారా రక్తహీనత తీవ్రతను తగ్గించవచ్చు. మహిళల్లో వ్యాధి నిరోధకచర్యల్లో భాగంగా పోషక విలువల లోటు, అధిక పోషకవిలువలు, రక్తహీనత, ఎన్‌సిడి పరీక్షలు చేపట్టడం కీలకం. మహిళలు తగినంత పోషకాలు కలిగిఉండి ఆరోగ్యంగా జీవించేందుకు ఈ చర్యలు దోహదపడ తాయి. అప్పుడే వారు ఇంటిలో కూడా ఆరోగ్య, పోషకాహార విలువలను పెంచుకోగలుగుతారు. జాతీయాభివృద్ధిలో కీలక పాత్రధారులుగా మహిళలు తమ పాత్ర సమర్థవంతంగా పోషించగలిగినప్పుడే దేశం పూర్తి స్థాయిలో ప్రయోజనం పొందగలుగుతుంది.

# కిషోర్ వికాసంపై బాలబాలికల్లో అవగాహన కల్పించాలి

## కడప జిల్లా కలెక్టర్ సి హరికిరణ్

జిల్లాలో కిషోర్ వికాసంపై బాలబాలికల్లో అవగాహన కల్పించేందుకు సైనికుల్లా పనిచేయాలని జిల్లా కలెక్టర్ సి హరికిరణ్ ప్రాజెక్టు రిసోర్స్ గ్రూప్స్ (పీజీటీ)లను ఆదేశించారు. కిశోరి వికాసం ఫేజ్-2లో భాగంగా ఐసీడీఎస్ ఆధ్వర్యంలో ఇటీవల స్థానిక మీకోసం హాలులో ప్రాజెక్టు రిసోర్స్ గ్రూప్స్ (పీజీటీ)లకు ఒకరోజు అవగాహన కార్యక్రమం జరిగింది. ఈ కార్యక్రమంలో పాల్గొన్న కలెక్టర్ మాట్లాడుతూ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల ఆధ్వర్యంలో కిశోరి వికాసం రెండవ దశ కార్యక్రమాన్ని జిల్లాలో అమలు చేయడం జరుగుతోందని చెప్పారు. జిల్లాలో ఇప్పటివరకు 911 పాఠశాలల్లో 1,11,865 మంది 8,9,10వ తరగతి చదువుతున్న వారిని గుర్తించామన్నారు. కౌమార దశలోకి వస్తున్న 8, 9, 10వ తరగతి చదువుతున్న అమ్మాయిలు, అబ్బాయిలకు సమాజం పట్ల వారు ప్రవర్తించాల్సిన తీరు ఆ వయస్సులో సమస్యలను ఎదుర్కోవలసి వస్తే ఏ విధంగా ప్రవర్తించాలి, అబ్బాయిలు సమాజం, అమ్మాయిల పట్ల ఏరకంగా బాధ్యతగా ఉండాలి, మహిళ కూడా ఒక మనిషే. ఆమె పట్ల ఏ రకంగా గౌరవ మర్యాదలతో ప్రవర్తించాలో నేర్పించటం ఇందులో భాగం అన్నారు. తదితరాలలో తగిన విధమైన ఆత్మవిశ్వాసం బాలబాలికలలో కలిగించేందుకు కృషి చేయాలన్నారు. నేటి అవగాహన కార్యక్రమంలో పాల్గొంటున్న ప్రాజెక్టు రిసోర్స్ గ్రూప్స్ సభ్యులలో మెడికల్, లీగల్, పోలీస్, ఐసిడిఎస్, ఎన్జీవోలు శిక్షణపై అవగాహన కల్పించుకొనాలన్నారు. ఆ తర్వాత స్టూడెంట్స్‌కు ఆయా అంశాలలో అవగాహన కల్పించాలని సూచించారు. ఇందుకు పీఆర్‌జీలకు పాఠశాలలకు ఎపుడెపుడు వెళ్లాలనే విషయంలో షెడ్యూల్ ఇస్తామని చెప్పారు. ఈ షెడ్యూల్‌ను ఐసిడిఎస్ పీడీ, డీఈఓలు రూపొందించాలని ఆదేశించారు. జిల్లాలో మహిళల అక్రమ రవాణా నివారణకు కూడా స్టూడెంట్స్‌కు అవగాహన కలిగించాలి. అక్రమ రవాణా ఉచ్చులో పడకుండా ఆ దిశగా స్టూడెంట్స్‌కు అవగాహన, చైతన్యం కలిగించాలని కలెక్టర్ పేర్కొన్నారు. కార్యక్రమంలో జేసీ-2 శివారెడ్డి మాట్లాడుతూ పీఆర్‌జీలకు నేటి కార్యక్రమంలో ముఖ్యంగా 4 అంశాలలో అవగాహన కలిగిస్తారని, పౌష్టికాహార లోపం తద్వారా కలిగే నష్టాలు, బాల్య వివాహాల వల్ల కలిగే దుష్పరిణామాలు, వాటి నివారణ వయసుతో నిమిత్తం లేకుండా ఆడవారిపై లైంగిక వేధింపులు జరగడం, మహిళల అక్రమ రవాణా, ఎలాంటి పరిస్థితులలో అక్రమ రవాణాకు గురి అవుతారనే విషయాలపై శిక్షణ ఇస్తారని, వాటిని కిశోరి బాలబాలికలకు వివరించి, చక్కని సంస్కారం, విలువలతో కూడిన జీవితం గడపాల్సిన ఆవశ్యకతను తదితర అంశాలలో అవగాహన కలిగించాలని చెప్పారు. కార్యక్రమంలో ఐసిడిఎస్ పిడి పద్మజ, డీఈఓ శైలజ, మహిళా పోలీస్ స్టేషన్ డీఎస్పీ వాసుదేవన్ తదితరులు కిశోరి వికాసంలో పిఆర్‌జీలు చేయవలసిన అంశాలను వివరించారు. అనంతరం పవర్ పాయింట్ ప్రెజెంట్ ద్వారా వివిధ అంశాలలో పీఆర్‌జీలకు అవగాహన కల్పించారు. ఈ కార్యక్రమంలో డిఎంహెచ్‌వో ఉమాసుందరి, డిసిపిఓ శివప్రసాదరెడ్డి, మెడికల్, లీగల్, పోలీస్, ఎన్జీవో విభాగాల పీఆర్‌జీలు తదితరులు పాల్గొన్నారు.

# మహిళల భద్రతకు 'వొడాఫోన్ సఖీ'

మహిళల భద్రతకు దోహదపడే వొడా ఫోన్ సఖీ సర్వీసును వొడాఫోన్ ఐడియా లిమిటెడ్ ఇటీవల ప్రారంభించింది. ఈ మొబైల్ ఆధారిత సర్వీసు ద్వారా ఎమర్జెన్సీ అలర్ట్స్, ఎమర్జెన్సీ బ్యాలెన్స్, ప్రైవేట్ నెంబరు రీచార్జ్ వంటి సేవలను ప్రీపెయిడ్ సర్వీసులను వినియోగించుకుంటున్న మహిళా కస్టమర్లు పొందవచ్చు. ఈ సర్వీసును స్మార్ట్‌ఫోన్లలోనే కాకుండా ఫీచర్ ఫోన్ల ద్వారానూ పొందవచ్చని...ఖాతాలో బ్యాలెన్స్ లేకున్నా మొబైల్ ఇంటర్నెట్ లేకపోయినా ఈ సేవలను వినియోగించుకోవచ్చని వొడాఫోన్ ఐడియా లిమిటెడ్ అసోసియేట్ డైరెక్టర్ (కన్స్యూమర్ బిజినెస్) అవ్నీషం ఖోస్లా తెలిపారు. దేశ జనాభాలో దాదాపు సగం మంది మహిళలు ఉన్నారని, వీరిలో 18 శాతం కన్నా తక్కువ మంది మహిళలు మొబైల్ ఖాతాదారులుగా ఉన్నట్టు ఆయన చెప్పారు. వొడాఫోన్ సఖీ సేవను బ్యాడ్మింటన్ స్టార్ పివి సింధు లాంఛనంగా ప్రారంభించారు.

# బాలల సంరక్షణలో బాధ్యత ఏదీ?

✦ కఠినమైన నిఘా, నియంత్రణ ✦ ప్రభుత్వ స్థాయిలోనే పర్యవేక్షణపై కొరవడిన స్పష్టత

✦ స్వచ్ఛంద ముసుగులో చాలాచోట్ల సీసీఐల ఇష్టారాజ్యం

ప్రభుత్వపరంగా నిఘా, నియంత్రణ కొరవడడంతో రాష్ట్రంలో అనాథ బాలల్ని ఉద్ధరిస్తామని ఉద్భవించిన కొన్ని బాలల సంరక్షణ కేంద్రాలు ఇష్టమొచ్చినట్టు వ్యవహరిస్తున్నాయి. పరిస్థితి ఎంత ఘోరంగా తయారైందంటే అసలు ఇలాంటి కేంద్రాలు(చైల్డ్ కేర్ సెంటర్స్- సీసీఐ) ఎక్కడ... ఎన్ని ఉన్నాయో ప్రభుత్వం వద్ద లెక్కాపత్రం లేదు. ఎవరు ఏర్పాటు చేశారు? ఎలా నిర్వహిస్తు న్నారు? ఎలాంటి కార్యకలాపాలు జరుగుతున్నాయి వంటి వాటిని పర్యవేక్షించే యంత్రాంగమేదీ లేదు. విదేశీ సంస్థలు, కొన్ని మత సంస్థలు, ప్రైవేట్ సంస్థల ద్వారా నిధులు పొందిన స్వచ్ఛంద సంస్థలు కొన్ని సీసీఐలను నిర్వహిస్తున్నాయి. ఈ కేంద్రాలకు వచ్చే నిధులేమిటో... వాటికి సంబంధించిన జమాఖర్చులేమిటో.. వాటి గురించి ఎవరు అడగాలో ప్రభుత్వంలో ఎవరికీ తెలీదు. ఉత్తరప్రదేశ్, బిహార్‌లలో ఇటీవల బయటకొచ్చిన ఉదంతాల నేపథ్యంలో మన రాష్ట్రంలోని సీసీఐలలో బాలల భద్రత చర్చనీయాంశమైంది. ఈ పరిస్థితుల్లో క్రితం నెలలో జిల్లాల్లో తనిఖీ కమిటీలను నియమించారు. ఈ కమిటీలు ఈ కేంద్రాలకు వెళ్లి అక్కడ సౌకర్యాలు, బాలల సంరక్షణ చర్యలపై ప్రాథమిక నివేదికను కలెక్టర్లకు అందజేస్తాయి.

## మనవద్దా కొన్ని ఘటనలు

✦ కృష్ణా జిల్లాలో ఒక ఎన్జీఓ బాలల సంరక్షణ కేంద్రాన్ని నిర్వహిస్తోంది. అందులో 18 ఏళ్లు నిండిన యువతులు కూడా ఉన్నారు. మొన్న వేసవి సెలవుల సమయంలో వారిని అదే సంస్థకు ఊరిబయట ఉన్న కేంద్రానికి తీసుకెళ్లారు. కొందరు ఫిర్యాదు చేయడంతో స్త్రీ, శిశు సంక్షేమ శాఖ అధికారులు అక్కడకు వెళ్లారు. యువతులను ఇక్కడ ఎందుకు ఉంచారని ప్రశ్నించారు? వారి సంరక్షణ బాధ్యత తీసుకునేలా ఉంటే ఏదేని వసతిగృహాలకు పంపించాలని స్పష్టం చేశారు. ఇంకా ఆ సమస్య కొలిక్కి రాలేదు.

✦ నంద్యాల లోక్‌సభ పరిధిలోని ఒక కేంద్రంలోనూ కొన్ని అసభ్యకర ఘటనలు చోటు చేసుకున్నాయి.

✦ మచిలీపట్నంలో రెండేళ్ల కిందట ఇలాంటి ఆరోపణల నేపథ్యంలోనే ఒక కేంద్రాన్ని అప్పట్లో మూయించారు.

✦ తూర్పుగోదావరి జిల్లాలో ఒక కేంద్రంలో కళ్లులేని చిన్నారిని దారుణంగా హింసించిన ఘటనా తెలిసిందే.

## దిక్కూమొక్కూలేని పిల్లలు దొరికితే ఏం చేయాలి?

బాలల సంరక్షణ కేంద్రాల వారికి దిక్కూమొక్కూ లేని పిల్లలు దొరికితే ముందుగా వారు బాలల సంక్షేమ కమిటీ (చైల్డ్ వెల్ఫేర్ కమిటీ- సీడబ్ల్యూసీ) ముందుకు తీసుకురావాలి. ఆ కమిటీ పరిశీలించి సంతృప్తిచెందితే ఆ చిన్నారులను సంరక్షణ నిమిత్తం సీసీఐల్లో ఉంచేందుకు అనుమతిస్తాయి. బాలకార్మికులుగా పనిచేస్తున్నవారిని విడిపించినపుడూ, ఇతర పరిస్థితుల్లోని పిల్లలను తీసుకొచ్చినపుడు కూడా ఇదే ప్రక్రియ ఉంటుంది. కొద్దిరోజులు ఆశ్రయం కల్పించాక తల్లిదండ్రుల గురించి వాకబు చేసి అప్పగించాలి. అనాథలైతే వారిని దత్తతనిచ్చేందుకు స్త్రీ శిశు సంక్షేమ శాఖకు అప్పగించాలి.

## తాజా పరిస్థితులు ఇలా...

✦ భద్రతా చర్యల్లో భాగంగా సీసీఐల ప్రవేశద్వారం వద్ద, లోపల గదిలో సీసీ కెమెరాలను ఏర్పాటు చేయాలని స్పష్టం చేసినా... ఒక్కటంటే ఒక్క కేంద్రంలోనూ ఇప్పటివరకూ ఏర్పాటు చేసిన దాఖలాల్లేవని పోలీసు వర్గాలు తెలిపాయి.

✦ సీసీఐలు పిల్లలను దత్తతకు ఇవ్వడం లేదు. పిల్లలు లేకపోతే నిధులు రావని అలా చేస్తున్నారు.

✦ ఇటీవల జిల్లా స్థాయుల్లో ప్రత్యేక బృందాలను ఏర్పాటు చేసి సీసీఐల్లో దత్తతనిచ్చేందుకు ఎంతమంది పిల్లలున్నారన్న లెక్కలు తేల్చే ప్రయత్నం చేయగా ఒకచోట ప్రతిఘటన ఎదురైంది. ప్రభుత్వం నుంచి నిధులు తీసుకోవట్లేదు మీకు సమాధానం చెప్పాల్సిన అవసరం మాకు లేదు? మీకు తనిఖీ చేసే అధికారం ఎక్కడుంది అనే ప్రశ్నలు ఎదురయ్యాయి.

✦ సీసీఐలు అన్నీ నమోదు చేయించుకోవాలని బాలల సంక్షేమ శాఖ గత ఏడాది ప్రకటన జారీ చేయగా ఇప్పటి వరకు రాష్ట్రవ్యాప్తంగా 800 సంస్థలు ముందుకొచ్చాయి. ఇంకా ఎన్ని మిగిలిపోయాయో అధికారులు లెక్కలేస్తున్నారు.

# తుఫాన్ ప్రభావిత ప్రాంతాల్లో కమీషనర్ సుడిగాలి పర్యటన

## బాధితులకు 42 వేల లీటర్ల పాలు సరఫరా



వడి వడి అడుగులు లోతైన పరిశీలన...ఏ పని తలపెట్టినా ఉత్తమ ఫలితాలు సాధించే లక్ష్యసాధన సిబ్బంది మధ్యకు వెళ్ళి వాళ్ళ మంచి చెడులు పట్టించుకుంటూనే తాను ప్రాతినిధ్యం వహిస్తున్న శాఖను అన్నింటా అగ్రగామిగా నిలపాలనే తపన ఉద్యోగులు అందరూ బాధ్యతాయుతంగా విధులు నిర్వర్తించాలనే ఆలోచన ఎప్పటి సమస్యలకు అప్పుడే పరిష్కారం చూపాలనే పట్టుదల సిబ్బందినందరిని సమన్వయం చేసి తనశాఖకు కీర్తి ప్రతిష్టలు తేవాలనే సంకల్పం ప్రభుత్వ ఆశలకు, ఆలోచనలకు దగ్గరగా సమగ్రత ప్రగతి ఒక ధ్యేయంగా పనిచేస్తున్న మహిళా స్త్రీ శిశు సంక్షేమశాఖ కమీషనర్ మరియు సెక్రటరీ హెచ్ అరుణ కుమార్ ఇటీవల సంభవించిన తిత్లీ తుఫాన్ కారణంగా శ్రీకాకుళం జిల్లాలో దెబ్బతిన్న అంగన్‌వాడీ కేంద్రాలను పరిశీలించేందుకు, అక్కడ పరిస్థితులు స్వయంగా తెలుసుకునేందుకు ఆయా ప్రాంతాల్లో సుడిగాలి పర్యటన చేసారు. ఎటువంటి ముందస్తు సమాచారం ఇవ్వకుండానే ఆ జిల్లాలోని పలు మండలాల్లోని సెంటర్లలో తనిఖీలు నిర్వహించి సంతృప్తి వ్యక్తం చేసారు. తుఫాన్ కారణంగా నష్టం వాటిల్లిన అంగన్‌వాడీ కేంద్రాలను క్షుణ్ణంగా పరిశీలించారు. ప్రతిరోజూ అంగన్‌వాడీ కేంద్రాల ద్వారా పౌష్టికాహారం పొందుతున్న లబ్ధిదారులకు అంతరాయం కలగకూడదని పాక్షికంగా దెబ్బతిన్న దాదాపు 11 సెంటర్ల స్థానంలో ప్రత్యామ్నాయ ఏర్పాట్లు చేసి బాధితులకు ఫీడింగ్ అందేలా చర్యలు తీసుకున్నారు. ప్రజలతో మమేకమై అంగన్‌వాడీ కేంద్రాల ద్వారా అందుతున్న సేవలపై ఆరా తీసారు. బాలసంజీవిని, అమృత హస్తం, బాలామృతం వంటి పథకాలు ప్రజలకు ఏ మేరకు లబ్ధి చేకూరుతున్నాయనే విషయాన్ని లబ్ధిదారులను అడిగి తెలుసుకున్నారు. అలాగే అంగన్‌వాడీ భవనాలు మంజూరు కాబడి, కొన్ని ప్రాంతాల్లో శంకుస్థాపనలు జరిగి నిర్మాణానికి నోచుకోని భవనాల స్థితిగతులపై స్థానిక సిడిపిఒలను అడిగి జాప్యానికిగల కారణాలపై విశ్లేషించారు. శంకుస్థాపనలు జరిగిన భవనాల నిర్మాణాలు మూడు, నాలుగు నెలల్లో పూర్తిఅయ్యేలా చర్యలు తీసుకోవాలని అధికారులను ఆదేశించారు. ముఖ్యంగా తుఫాన్ ప్రభావిత ప్రాంతాల్లో పిల్లలకు ..దనంగా 42 వేల లీటర్ల పాలను ఎ.పి. డైరీ డెవలప్‌మెంటు ద్వారా యుద్ధప్రాతిపదికన రప్పించి సరఫరా చేయించారు. ఒకవిధంగా ఉద్దానం బాధితులకు అంగన్‌వాడీల ద్వారా అందుతున్న సేవల్లో లోపం అనేది లేకుండా చూసారు. వజ్రపు కొత్తూరు మండలం మంచినీళ్ల పేటలో ఉన్న ఒక కమ్యూనిటీ హాలులోనిర్వహిస్తున్న అంగన్‌వాడీ కేంద్రం పనితీరును ప్రత్యేకంగా పరిశీలించి అక్కడ పిల్లలతో మమేకమై పిల్లలకు కుశల ప్రశ్నలు వేసారు. స్థానిక కార్యకర్తల పనితీరును కమిషనర్ మెచ్చుకున్నట్లు తెలిసింది. సముద్రపు ఒడ్డున ఉండే ఆ ప్రాంతంలో అంగన్‌వాడీకి వచ్చే చిన్నారులు ఎంతో చురుగ్గా అడిగిన ప్రశ్నలకు తడుముకోకుండా జవాబు చెప్పటంపట్ల ఆయన ఆనందం వ్యక్తపరిచారు. ఆ గ్రామంలో అంగన్‌వాడీ కేంద్రం మంజూరు అయినప్పటికి భవన నిర్మాణంలోగల జాప్యాన్ని స్థానికులను అడిగి తెలుసుకున్నారు. తమ గ్రామం మధ్యలో అంగన్‌వాడీ భవనం నిర్మాణం జరిగితే బాగుంటుందని మంజూరుకాబడిన భవనం ఊరికి కొంచెం దూరంలో ఉందని చెప్పగా ప్రభుత్వ పాఠశాలలో ఏదైనా స్థలం అందుబాటులో ఉంటుందేమో అని చూసారు. అయితే అక్కడ పాఠశాలకే స్థలం ఇరుగ్గా ఉండటంతో ప్రక్కనే ఉన్న ప్రభుత్వ స్థలంలో బిల్డింగ్ నిర్మించేందుకు చర్యలు తీసుకుంటానన్నట్లు కమీషనర్ అక్కడి వారికి చెప్పారు. మొత్తానికి జిల్లా అంతటా పర్యటించి కేంద్రాలను సైతం తనిఖీలు చేసి సంతృప్తి వ్యక్తం చేయటంతో సిడిపిఒలు ఊపిరి పీల్చుకున్నారు.





# కష్టంతో కాకుండా ఇష్టపడి పనిచేయాలి

**అవకాశం...జీవితంలోని ప్రతిదశలోనూ మనకు ఎదురవుతూనే వుంటుంది. కాకపోతే ఒక్కోసారి వెతుక్కోవాలి. ఒక్కోసారి ఎంచుకోవాలి. మరోసారి సృష్టించుకోవాలి. ఇంకోసారి పోరాడి సాధించుకోవాలి, ఏమి చేసినా దానిని సరైన సమయంలో అందుకోగలగాలి...! అలాంటి వాళ్ళే సాటి వారికి స్ఫూర్తి ప్రదాతలవుతారు. అలాంటి కోవకు చెందినవారే కర్నూలు, చిత్తూరు, కడప, అనంతపురం జిల్లాల ప్రాంతీయ సంచాలకులు కె.శ్యామసుందరి...**

ఎమ్.ఎస్.సి హోమ్ సైన్స్ పూర్తి చేసి 'కేర్' అనే అంతర్జాతీయ సంస్థలో ఫీల్డ్ ఆఫీసర్‌గా ఉద్యోగంలో చేరిన శ్యామ్‌సుందరికి ఆ ఉద్యోగం సంతృప్తినివ్వలేదు. తాను చదివిన చదువుకు ఇంకా మంచి ఉద్యోగం సంపాదించాలి పదిమందికి ఉపయోగపడాలనే ఆలోచనతో 1994 సంవత్సరంలో పబ్లిక్ సర్వీసు కమీషన్ ద్వారా మహిళా స్త్రీ శిశు సంక్షేమశాఖలో సర్కారు కొలువు సాధించారు. సిడిపిఒ హోదాలో 1994 ఆగస్టు విధుల్లో చేరిన ఈమెకు గుంటూరు జిల్లా మాచర్ల ప్రాజెక్టుకు పి.ఓ.గా నియమించారు. ఇక్కడ ఏడాదిపాటు పనిచేసి కేర్ ఇంటర్నేషనల్ ఆర్గనైజేషన్‌లో చేసిన అనుభవం ఈమెకు తోడు అవటంతో హైదరాబాద్ ఐసిడిఎస్ ప్రధాన కార్యాలయానికి బదిలీ చేసి ప్రపంచబ్యాంకు ప్రాజెక్టులో పోస్టింగ్ ఇచ్చారు. దాదాపు 2003 సం॥ వరకు అదే పోస్టులో కొనసాగుతూ వచ్చిన శ్యామ్‌సుందర్‌కి అదే ఏడాది ప్రాజెక్టు డైరెక్టర్‌గా పదోన్నతి ఇచ్చి మహబూబ్‌నగర్ పి.డి.గా నియమించారు. మనిషి సత్తాను పరీక్షించే పరీక్షలు ఒక్క ప్రభుత్వ ఉద్యోగంలోనే కాదు ఏ రంగంలోనైనా, ఎక్కడైనా, ఎప్పుడైనా అడ్డంకులు తప్పవు. వాటిని అధికమించినప్పుడే విజయం అందుకోగలం అని విశ్వసించే ఈమె పి.డి.గా ఏడాదిపాటు మహబూబ్ నగర్‌లో విధులు నిర్వర్తిస్తుండగానే తిరిగి హైదరాబాద్ ప్రధాన కార్యాలయానికి రప్పించి అసిస్టెంటు డైరెక్టర్‌గా పదోన్నతి కల్పించి హెచ్ఐవి ఎయిడ్స్ ప్రోగ్రామ్‌లో స్టేట్‌లెవెల్ ఆఫీసర్‌గా చేయమన్నారు. అక్కడ ఏడాదిన్నర పాటు పనిచేసాక మళ్ళీ పదోన్నతి ఇచ్చి డిపార్టుమెంటులోనే పిల్లల దత్తత (ఎడాప్షన్) విభాగంలో రెండు సంవత్సరాలపాటు పనిచేసారు. జీవితంలో కష్టాలు ఒడిదుడుకులు అనేవి సహజం. అధికమిస్తేనే అది పరిపూర్ణ జీవితమవుతుంది అని నమ్మే శ్యాంసుందరి ఉద్యోగ జీవి తంలో ఎక్కడా రాజీపడలేదు. ఎక్కడికి బదిలీ చేస్తే అక్కడికి వెళ్ళే వారు.

**ఆర్.జె.డి కె.శ్యామసుందరి**



సిఫార్సులుకి పైరవీలకి ఎప్పుడూ దూరంగానే వున్నారు. ఓటమి నుంచి నేర్చుకోవాల్సింది నువ్వు పనికిరావని కాదు. నీ పనిని మరింత ఓర్పుగా, పట్టుదలగా చేయాలని చెప్పే ఈమె దత్తత విభాగం నుండి హైదరాబాద్‌లోని మర్రి చెన్నారెడ్డి మానవవనరుల అభివృద్ధిలో సీనియర్ ఫ్యాకల్టీగా సంవత్సరంపాటు పనిచేసి మళ్ళీ ప్రమోషన్‌పై అనగా డిప్యూటీ డైరెక్టర్ (డిడిగా) పదోన్నతిపొంది మహిళా స్త్రీ శిశు సంక్షేమ విభాగంలోనే ఒక భాగంగా ఉన్న ఐసిడిఎస్‌లో ఇన్‌ఛార్జి జెడిగా విధులు నిర్వర్తించారు. స్వశక్తిని, ఆత్మవిశ్వాసాన్ని నమ్ముకుని ఇంతటి ఉన్నతస్థాయికి ఎదిగారు. డిడిగా పదోన్నతి పొందాక తెలుగు రాష్ట్రాలు రెండుగా చీలిపోయాక జాయింట్ డైరెక్టర్‌గా ఎస్.ఎన్.పి.లోనూ, స్కీమ్స్ విభాగంలోనూ పనిచేసారు. డిపార్టుమెంటులో దాదాపు అన్ని విభాగాలపైనా పట్టు సాధించారు. హైదరాబాద్ నుండి కార్యాలయం గుంటూరు తరలివచ్చాక ఇస్నిఫ్ ప్రాజెక్టు కోఆర్డినేటర్‌గా చేసి అనంతరం గుంటూరు పిడిగా నాలుగు మాసాలు పనిచేసారు. తిరిగి రీజనల్ జాయింట్ డైరెక్టర్‌గా ఈ ఏడాది జూన్‌లో పదోన్నతి కల్పించి కర్నూలు, అనంతపురం, చిత్తూరు, కడప జిల్లాల ఆర్‌జెడిగా నియమించారు. దాదాపు 24 సంవత్సరాలు ఐసిడిఎస్‌లో ఆమె సేవలు కొనసాగాయి. సర్వీసు అంతటిలో ఎన్నో అవార్డులు రివార్డులు అందుకున్నారు. చివరిగా ఆమె 'అంగన్‌వాడి వాయిస్'తో మాట్లాడుతూ ఇప్పుడున్న సిబ్బంది కష్టపడి పనిచేస్తున్నారుగాని ఇష్టంగా పనిచేసి ఫలితాలు సాధించే దిశగా ఇంకా చేయాలి. అప్పుడే వాళ్ళు అనుకున్న ఫలితాలు సాధిస్తారు అన్నారు. ఇప్పుడు ఉన్న పని ఒత్తిడికి యువరక్తం అవసరమన్నారు. మొత్తానికి అనుభవం నేర్పిన పాఠం జీవితంలో నేర్చుకున్న జ్ఞానంతో ఉద్యోగ జీవితంలో ఎక్కడా రాజీపడకుండా సర్వీసు పూర్తి చేసారు. హేట్సాఫ్ మేడమ్... పదవి విరమణ అనంతరం ఆయురారోగ్యాలతో వర్ధిల్లాలని 'అంగన్‌వాడీ వాయిస్' మనస్ఫూర్తిగా కోరుకుంటుంది.



# పౌష్టికాహార లోప మహమ్మారిని నిర్మూలించటమే వరల్డ్ విజన్ లక్ష్యం

## జిల్లాలో ఘనంగా జరిగిన పోషణ అభియాన్ కార్యక్రమం





దేశంలోని పౌష్టికాహారలోప మహమ్మారిని నిర్మూలించటా నికి, పెరుగదల లోపం రక్తహీనత తక్కువ బరువుతో పుట్టడం వంటి సమస్యలను నివారించేందుకు జాతీయ స్థాయిలో **2018** సెప్టెంబరు మాసాన్ని కేంద్ర ప్రభుత్వం పోషణ మాసంగా ప్రకటించారు. పోషణ అభియాన్ పథకాన్ని రాజస్థాన్‌లోని ఝున్‌ఝు నుండి ప్రారంభించారు. ఏ దేశమైన బలమైన నాగరికతను నిర్మూలించాలంటే ఆ దేశంలో మహిళలు సమానహక్కులు, సమాన ప్రాతినిధ్యం, సమాన ఆరోగ్య రక్షణలతో జీవితాలని ఆనందంతో గడపగలగాలి. ప్రతి మనిషి జీవితానికి మొదట వెయ్యి రోజులు కీలకం రెండు సంవత్సరాల వయస్సు వచ్చేసరికి మెదడు **85** శాతం అభివృద్ధి చెందుతుంది. సరైన ఆరోగ్య పరిరక్షణ పౌష్టికాహార తదితర అనుకూల పరిస్థితులతో పాటు పరిశుభ్ర వాతావరణం పిల్లల ఆరోగ్యకర భవిష్యత్తుకు అవశ్యకాలు. కావున దేశం నలుమూలలా సమగ్ర ఆరోగ్య సేవలను మహిళలందరికి అందుబాటులోకి తేవటానికి కేంద్ర ప్రభుత్వం శాయిశక్తులా కృషి చేస్తుంది. దానిలో భాగంగానే పోషణ అభియాన్ ప్రారంభించారు. ప్రపంచంలో రక్తహీనత భారతీయ మహిళల్లోనే అధికం. మహిళలు తగినంత పోషకాలు కలిగి ఉండి ఆరోగ్యంగా జీవించేందుకు అంగన్‌వాడీ కేంద్రాల ద్వారా వారి ఆరోగ్య పరీక్షలతోపాటు పౌష్టికాహారం కూడా అందిస్తున్నారు. పోషణ అభియాన్ కార్యక్రమంలో కుటుంబ ఆరోగ్య సంక్షేమ శాఖ విద్యాశాఖ, గిరిజన సంక్షేమశాఖ, పట్టణ గ్రామీణాభివృద్ధి శాఖ గ్రామీణ నీటి సరఫరాశాఖ, పంచాయితీరాజ్ శాఖ, వినియోగదారులశాఖ, ఆహారప్రజాపంపిణీశాఖ, మున్సిపల్ శాఖలను సమన్వయం చేస్తూ స్త్రీ శిశు సంక్షేమ శాఖ పలు కార్యక్రమాలను నిర్వహించింది. ఈ కార్యక్రమంలో ప్రభుత్వ శాఖలతోపాటు స్వచ్ఛంద సేవా సంస్థలు కూడా కలసి వినూత్న కార్యక్రమాలు నిర్వహించారు. దానిలో భాగంగా విజయనగరం జిల్లా గంట్యాడ మండలంలో వరల్డ్‌విజన్ ఇండియా అంతర్జాతీయ స్వచ్ఛంద సేవాసంస్థ పోషణ అభియాన్‌లో భాగంగా మేము సైతం అంటూ పలు ప్రజోపయోగ కార్యక్రమాలు చేపట్టి మంచి ఫలితాలు సాధించటమేకాక ప్రజాప్రతినిధులు ప్రభుత్వ అధికారుల మన్ననలను పొందారు. సమాజం మనకేమి చేసింది అనేది కాకుండా సమాజానికి నావంతుగా నేనేమి చేసాను అన్న ధోరణిలో లక్షలాది రూపాయలు వెచ్చించి మండలంలో ఎన్నో మౌళిక వసతులు రూపకల్పన చేసారు. ఆ వివరాలు వారి మాటల్లో....





తానే సృష్టించగలదు, మార్చగలదు. మహిళ ఒక పరిపూర్ణం. అనంతకాలం నుండి మన సమాజం నారీశక్తిని గుర్తించింది. వరల్డ్ విజన్ ఇండియా కూడా మహిళామణులకోసం వినూత్న కార్యక్రమాలు చేసి వారికంటూ ఒక ప్రత్యేక గుర్తింపుతోపాటు వారి కాళ్ళ మీద వాళ్ళను నిలబడేటట్లు చేసింది. పోషణ అభియాన్ పేరుతో పౌష్టికాహారలోపం లేని సమాజం కోసం విశేష కృషి చేస్తుంది. లోపపోషణ రహిత విజయ నగరం కోసం మేము సైతం అంటూ జనచైతన్య కార్యక్రమాలు నిర్వహించారు. సెప్టెంబర్ మాసమంతా వారానికి ఒక కార్యక్రమం చొప్పున నాలుగు వారాలు నాలుగు కార్యక్రమాలు నిర్వహించి ప్రజల్లో అవగాహన కల్పించారు. గంట్యాడ మండలంలోని ప్రతి అంగన్‌వాడీ కేంద్రాన్ని కార్యక్రమాల్లో భాగస్వామ్యం చేసి మాతా శిశు మరణాలను నివారించేందుకు విశేష కృషి చేస్తున్నారు. నెలరోజులపాటు పౌష్టికాహార విశిష్టతను ప్రతి ఒక్కరికి అర్థమయ్యేరీతిలో చెప్పటానికి కళాజాతాలను సైతం ఉపయోగించినట్లు వరల్డ్ విజన్ కరుణామయ ఎడిపి సంస్థ మేనేజర్ పి శ్యాంబాబు 'అంగన్‌వాడీ వాయిస్'కి చెప్పారు. గర్భిణీలు క్రమం తప్పకుండా పౌష్టకాహారం భుజించటంవల్ల తల్లిబిడ్డలకు కలిగే ప్రయోజనాలు వివరించి వారిలో అవగాహన తీసుకువచ్చారు. మండల పరిధిలోని 30 గ్రామాల్లో కార్యక్రమాలు నిర్వహించటం విశేషం. అలాగే రసాయనాలు లేని నాణ్యమైన ఆహారంకోసం ప్రభుత్వం ప్రతి అంగన్‌వాడీ కేంద్రానికి న్యూట్రీగార్డెన్లు మంజూరు చేసింది. అయితే పేద ప్రజలకు మరింత చేరువకావటానికి ఏడు లక్షల రూపాయలు వెచ్చించి మండలంలోని ఏడు గ్రామాల్లో న్యూట్రీగార్డెన్లు అభివృద్ధి చేసారు. అలాగే అంగన్‌వాడీ కేంద్రాల్లోని పిల్లలకు అనుబంధ ఆహారాన్ని కూడా అందించి లోపపోషణ లేకుండా చేస్తున్నారు. కేవలం గ్రామీణ ప్రాంతాల్లో పౌష్టికాహారంపై అవగాహన లేని కారణంగానే మాతృమరణాలు, శిశు మరణాలు సంభవిస్తున్నాయని భావించి గ్రామాల్లో పౌష్టికాహార అవగాహన సదస్సులు ఏర్పాటు చేసి మహిళల్లో సంపూర్ణ అవగాహన కల్పించారు. ముఖ్యంగా కలుషిత నీటిని త్రాగటం మూలంగా అంటు రోగాలు సంభవిస్తున్నాయని ప్రతివారు సురక్షితమైన నీటిని త్రాగాలని గంట్యాడ గ్రామంలో వాటర్ ప్లాంట్‌ను నిర్మించి స్థానిక శాసనసభ్యులు కెఎ నాయుడుతో ప్రారంభింపజేశారు. మండలాన్ని దత్తత తీసుకుని దశలవారీగా పలు అభివృద్ధి కార్యక్రమాలు నిర్వహించటం అభినందనీయమని ఎంఎల్ఎ వరల్డ్‌విజన్ సంస్థను అభినందించారు. పోషణ అభియాన్‌లో భాగంగా కళాజాతా బృందాలు ద్వారా మొదట విడత అనగా సెప్టెంబర్ 1 నుండి 12వ తేదీ వరకు 78 గ్రామాల్లో అనగా మూడు మండలాల్లో పోషణ అభియాన్ ముఖ్యఉద్దేశ్యాన్ని 20 వేలమందికి అవగాహన కల్పించారు. రెండవ విడతలో భాగంగా అనగా సెప్టెంబరు 21 నుండి 25వ తేదీ వరకు గంట్యాడ మండలంలోనే 27 గ్రామాల్లో ఉన్న ప్రభుత్వ ఉన్నత పాఠశాలల్లో చదివే విద్యార్థినీ విద్యార్థులకు పోషణ అభియాన్‌పై పూర్తి అవగాహన కల్పించారు. అనంతరం పిల్లల్లో ఎదుగుదల, వారి ఆరోగ్య పరిరక్షణ నిమిత్తం తల్లుల్లో అవగాహన కల్పించేం దుకు వెల్‌బేబీషో నిర్వహించి విజేతలకు బహుమతులు అంద జేసారు. పూర్వ ప్రాథమిక విద్య ఆవశ్యకతను వివరించారు. అలాగే పౌష్టికాహార విశిష్టతను తెలియపరిచేందుకు ఫుడ్ ఎగ్జిబిషన్ ఏర్పాటు చేసి ఏ ఆహారం తీసుకుంటే ఎలాంటి మేలు చేకూరుతుందో వివరించారు. అనంతరం గంట్యాడ మండలంతోపాటు బొండపల్లి విజయనగరం మండలానికి చెందిన రక్తహీనత గల వారికి పలు కార్యక్రమాలు అమలు చేస్తున్నామన్నారు. ప్రజల భాగస్వామ్యంతో అధికారుల అండదండలతో ఇంత మంచి కార్యక్రమాలు జిల్లాలో అమలు చేస్తున్నామని మేనేజర్ శ్యామ్ అన్నారు.

# పోషకాహార పంపిణీలో అవకతవకలు సహించం

## ఆహార భద్రత కమిషన్ ఛైర్మన్ పుష్పరాజ్ హెచ్చరిక

గర్భిణులు, బాలింతలు, చిన్నారులకు అంగన్‌వాడీ కేంద్రాల ద్వారా అందించే పోషకాహార పంపిణీలో లోటుపాట్లు జరిగితే సహించేది లేదని ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఆహారభద్రత కమిషన్ ఆగ్రహం వ్యక్తం చేసింది. కమిషన్ ఛైర్మన్ జెఆర్.పుష్పరాజ్, సభ్యులు ఎల్.వెంకట్రావులతో పాటు పలువురు అధికారులు, సీఆర్‌పీఎఫ్ సభ్యులతో కలిసి విశాఖపట్నంలోని పలు అంగన్‌వాడీ కేంద్రాలను ఆకస్మిక తనిఖీలు జరిపారు. తూనికలు కొలతల శాఖ, ఆహారభద్రత, పర్యవేక్షణ అధికారులు, పౌరసరఫరాల శాఖ, మహిళా శిశు సంక్షేమశాఖకు చెందిన అధికారులతో కలిసి పెదజాలారిపేటలో ఐసీడీఎస్ అర్బన్-1కు చెందిన అంగన్‌వాడీ కేంద్రాన్ని, రేషన్ దుకాణాన్ని సందర్శించారు. జేసీ-2 సిరి, మహిళా శిశుసంక్షేమశాఖ ఆర్జేడీ ఎ.ఈ.రాబర్ట్స్, డి.ఈ.ఒ. లింగేశ్వరరెడ్డి, తూనికలు, కొలతల శాఖ ఎ.డి. ప్రకాశరావు కూడా వీరితో పర్యటించారు. ముందుగా అంగన్‌వాడీ కేంద్రానికి చెందిన గోదామును సందర్శించి, సరఫరా చేస్తున్న కోడిగుడ్ల బరువును తూశారు. వీటిలో కొన్ని 40 గ్రాములలోపే ఉండటాన్ని గమనించి, దీనిపై నివేదిక సమర్పించాలని ఆదేశించారు. అక్కడ వండుతున్న ఆహారాన్ని పరిశీలించగా, కేంద్రంలో ఉన్న వారి కంటే తక్కువ మొత్తంలో వంట చేయటాన్ని గమనించారు. దీంతో అక్కడి సిబ్బందిపై ఆగ్రహం వ్యక్తం చేశారు. అధికారుల పర్యవేక్షణ లేకపోవటంతో కేంద్రాల ద్వారా పోషకాహార పంపిణీ సరిగా జరగటంలేదని, దీనికి బాధ్యులపై చర్యలు తీసుకోవాలని ఆదేశించారు. అనంతరం సమీపంలోని రేషన్ దుకాణంలో తనిఖీలు జరిపారు. అక్కడ తూనికల్లో తేడాలను గమనించారు. చౌకధరల దుకాణం ద్వారా ఎలాంటి అవినీతి జరిగినా వెంటనే తమ దృష్టికి తీసుకురావాలని సూచించారు. అనంతరం అంగన్‌వాడీ కేంద్రాన్ని సందర్శించి, చిన్నారులతో గడిపారు. చిన్నారుల ఆరోగ్య కార్డుల గురించి, ఆరోగ్య పరీక్షల గురించి తెలుసుకున్నారు. కృష్ణా కళాశాలను సందర్శించి, అక్కడ మధ్యాహ్న భోజన పంపిణీని పరిశీలించారు. సీఆర్‌పీఎఫ్ రాష్ట్ర అధ్యక్షుడు గొండు సీతారామ్, ఐసీడీఎస్ అధికారులు ఉషారాణి, పద్మావతి, ఆహారభద్రత అధికారి జనార్ధనరావు, తూ.కొ.శాఖ ఇన్‌స్పెక్టర్ రాధాకృష్ణ, ఆర్.ఐ. జిలాని, ఇతర అధికారులు పాల్గొన్నారు.



## 'సీనియర్‌సిటిజన్‌వాణి' పత్రిక సాహితీ పురస్కారాలు'

2019 జనవరిలో జరుగు సీనియర్‌సిటిజన్‌వాణిపత్రిక వార్షికోత్సవ కార్యక్రమంలో సాహిత్య, సాంస్కృతిక, విద్యా, సేవారంగాలలోని పెద్దలకు, సీనియర్ సిటిజన్స్‌కు, పెన్షనర్సుకు, సాహితీమూర్తులకు పురస్కారాలందించి, సన్మానించాలని నిర్ణయించాం. కాన ఆసక్తిగలవారు తమ సంక్షిప్త పరిచయంతోపాటు రెండు ఫొటోలు పంపుతూ ఈ దిగువ అడ్రస్సును సంప్రదించగలరు. అన్నీ పరిశీలించి అర్హులైన వారికి అనుమతిపత్రం, సీరియల్ నెంబరు పంపబడును.

(ముందుగా వచ్చిన అప్లికేషన్సుకు ప్రాధాన్యత యివ్వబడును) ఆఖరు తేదీ 30-12-2018.

**పి. సత్యనారాయణ, ఎడిటర్**

సీనియర్ సిటిజన్ వాణిపత్రిక, 17/52 ఈడేపల్లి,

మచిలీపట్నం-521 001 (ఎ.పి), సెల్ : 99493 08664



# మహిళల అభ్యున్నతికి తెదేపా కృషి

రాష్ట్రంలో స్వయం సహాయక సంఘాల మహిళల అభ్యున్నతికి తెదేపా ప్రభుత్వం కృషి చేసిందని రాష్ట్ర స్త్రీ, శిశు సంక్షేమ శాఖ మంత్రి పరిటాల సునీత అన్నారు. పశ్చిమగోదావరి/జిల్లా ఏలూరులోని శ్రీకన్వెన్షన్ హాల్లో చంద్రన్న పసుపు కుంకుమ, వడ్డీ రాయితీలపై మండల సమాఖ్య నాయకులు, వెలుగు సిబ్బందికి అవగాహన సదస్సు ఇటీవల నిర్వహించారు. ఈసందర్భంగా మంత్రి సునీత మాట్లాడుతూ గడిచిన నాలుగేళ్లలో స్వయం సహాయక సంఘాల మహిళలకు రూ.2514 కోట్ల వడ్డీ రాయితీని ప్రభుత్వం కల్పించిందన్నారు. మొత్తం 86 లక్షల మంది సభ్యుల పొదుపు ఖాతాలకు రూ. 8వేల చొప్పున రూ. 6833 కోట్లను జమ చేసిందని తెలిపారు. ప్రతి సభ్యురాలికి రూ. 2 వేలను దసరా పండుగ సందర్భంగా పసుపు కుంకుమ కానుకగా అందజేసిందన్నారు. ముఖ్యమంత్రి చంద్రబాబు ప్రతి మహిళకు పసుపు-కుంకుమ కానుకను అందిస్తున్నారని, అటువంటి కానుక తీసుకునే భాగ్యం తనకు లేకుండా పోయిందంటూ సునీత కంటతడి పెట్టుకున్నారు. మహిళల కోసం తెదేపా ప్రభుత్వం అనేక సంక్షేమ పథకాలను అమలు చేస్తోందన్నారు. గత నాలుగేళ్లలో డ్వాక్రా సంఘాలకు బ్యాంకు లింకేజీ కింద రూ. 51,740 కోట్లు ఇచ్చినట్లు తెలిపారు. స్త్రీనిధి కింద రూ. 3,900 కోట్లు, ఉన్నతి కింద రూ. 790 కోట్లను మహిళలకు అందించిన ఘనత తెదేపాకే .దక్కుతుందన్నారు. జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థకు వైభవం తీసుకువచ్చిన ఘనత కలెక్టర్ భాస్కర్‌కు దక్కుతుందన్నారు. జిల్లాలో గ్రామ సమాఖ్యలకు సొంత భవనాలు నిర్మించడం అభినందనీయమన్నారు. సెర్ప్ ముఖ్య కార్యనిర్వహణాధికారి పి.కృష్ణమోహన్ మాట్లాడుతూ రాష్ట్రంలో 7.40 లక్షల డ్వాక్రా సంఘాల్లో 74 లక్షల మంది మహిళల బ్యాంకు ఖాతాలకు గత నాలుగేళ్లలో రూ. 8 వేల కోట్లను మూడు విడతలుగా జమ చేసినట్లు తెలిపారు. కార్యక్రమంలో డీఆర్‌డీఏ పీడీ శ్రీనివాసులు, ఏఎస్పీ ఈశ్వరరావు, ఐసీడీఎస్ పీడీ విజయకుమారి పాల్గొన్నారు.

## మహిళల ఆర్థికాభివృద్ధికి ప్రభుత్వం కృషి

మహిళలు ఆర్థికాభివృద్ధి దిశగా అడుగులు వేసేందుకు, వారిలో ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించేందుకు రాష్ట్ర ప్రభుత్వం కృషి చేస్తుందని, మహిళల సంక్షేమానికి అనేక కార్యక్రమాలు అమలు చేస్తోందని రాష్ట్ర స్త్రీ, శిశు సంక్షేమశాఖ మంత్రి పరిటాల సునీత అన్నారు. ఏలూరులోని ప్రభుత్వాసుపత్రి ప్రాంగణంలో

## మంత్రి పరిటాల సునీత



నూతనంగా నిర్మించిన సఖి వన్‌స్టాప్ సెంటర్ భవనాన్ని ఇటీవల ఆమె ప్రారంభించి మాట్లాడారు. ప్రతి మహిళా తన కాళ్లపైతాను నిలబడేలా అందుకు అవసరమైన చేయూతను ప్రభుత్వం అందిస్తుందన్నారు. డ్వాక్రా రుణాలు, పౌష్టికాహారం పంపిణీ, మాతా శిశు సంరక్షణ తదితర కార్యక్రమాల ద్వారా మహిళల సంక్షేమానికి ప్రభుత్వం కృషి చేస్తుందన్నారు. ఆపదలో వున్న మహిళలు రక్షణ, న్యాయ సహాయం, ఆరోగ్య భద్రత, వైద్యసేవలన్నీ ఒకేచోట పొందేందుకు అవసరమైన వేదికను ప్రభుత్వం ఏర్పాటు చేసిందన్నారు. సఖి వన్‌స్టాప్ సెంటర్‌లను ప్రతీ జిల్లాలోనూ నెలకొల్పి ఈ సేవలన్నీ అందిస్తుందన్నారు. ఈ సందర్భంగా గర్భిణులకు మంత్రి సామూహిక సీమంతాలు చేశారు. పౌష్టికాహార కిట్లు పంపిణీ చేశారు. అంగన్‌వాడీ కేంద్రాల్లో ప్రీస్కూలు చదువుతున్న చిన్నారులతో మంత్రి కాసేపు ఉల్లాసంగా గడపారు.

## నాణ్యతతో కూడిన సరకుల సరఫరా

అంగన్‌వాడీ కేంద్రాలకు నాణ్యతతో కూడిన సరకులు సరఫరా చేసేందుకు తగిన చర్యలు చేపట్టామని మంత్రి పరిటాల సునీత తెలిపారు. కలెక్టరేట్‌లో ఏర్పాటుచేసిన పాత్రికేయుల సమావేశంలో ఆమె మాట్లాడుతూ అంగన్‌వాడీ కేంద్రాలకు నాణ్యతలేని సరకులను సరఫరా చేస్తే వాటిని సంబంధిత గుత్తేదారునికి పంపేసి నాణ్యమైన సరకులు పొందవచ్చన్నారు. సరకుల నాణ్యత విషయంలో రాజీపడే ప్రసక్తే లేదని తెలిపారు. అంగన్‌వాడీ కేంద్రాలకు సరఫరా చేసే గుడ్లను వారానికి మించి నిల్వ ఉంచవద్దని చెప్పారు. అంగన్‌వాడీ కేంద్రాలను గతంలోకన్నా మరింత సమర్థంగా నిర్వహిస్తున్నట్లు పేర్కొన్నారు. మహిళా సంక్షేమ పథకాల అమల్లో పశ్చిమగోదావరి జిల్లా ముందంజలో ఉందని తెలిపారు.

# శృం.గా.రం... ఏదీ సంసిద్ధత?

## లైంగిక ఆరోగ్యానికి దక్కని గౌరవం



*మనం అన్నింటికీ ముందే సంసిద్ధమవుతుంటాం! పెళ్ళికి ముందు నుంచే ఏర్పాట్లు చేసుకుంటాం. కాపురానికి ముందే ఇల్లు చూసుకుంటాం. పిల్లలకు ముందు బడిలో సీటు సిద్ధం చేసుకుంటాం. విరమణకు ముందే డబ్బు దాచుకుం టాం. ఇలా అన్నింటికీ ముందు నుంచే సిద్ధమవుతుండే మనం.. జీవితంలో అత్యంత కీలకఅంశమైన లైంగిక జీవనం విషయంలోనూ ఇంతే సంసిద్ధత ప్రదర్శిస్తున్నామా? లేనే లేదంటున్నారు నిపుణులు! శృంగారం విషయంలో మనం ప్రతిదశలోనూ వెనుకబడే ఉంటున్నాం! శృంగారాన్ని చీకటి వ్యవహారంగానే చూస్తున్నాం. చాటుమాటు తంతుగానే దాచేస్తున్నాం. అభంశుభం తెలీని పసిబిడ్డల వయసు నుంచీ ఛీఛీ అంటున్నాం. నవయవ్వన ఘడియల్లో ఇవ్వా ల్సిన విజ్ఞానం ఇవ్వటంలేదు. దాంపత్యంలోనూ దాగుడుమూతలే ఆడుతున్నాం. ఇక మలివయ సులో ఇదేం ముచ్చటని ఈసడించేస్తున్నాం. ప్రతిదశలోనూ మన ధోరణి అశాస్త్రీ యంగానే సాగుతోంది. శాస్త్రీయమైన అవగాహనతో చక్కటి శృంగార జీవి తాన్ని బాధ్యతాయుతంగా ఆస్వాదించేలా చెయ్యటంఒక్కటే దీనికి సరైనవిరుగుడు.*

మనలో చాలామంది గుండె జబ్బు వచ్చినప్పుడే గుండె గురించి ఎక్కువగా ఆలోచిస్తుంటారు. ఎముకలు విరిగినపుడే వాటి గురించి పట్టించుకుంటారు. ఏదైనా అంతేగాని... ఒక్క శృంగారం విషయంలో మాత్రం పరిస్థితి ఇందుకు పూర్తి భిన్నంగా ఉంటుంది. చాలామంది ప్రతిరోజూ, రోజులో ఎన్నోసార్లు దాని గురించి ఆలోచిస్తూనే ఉంటారు. ముఖ్యంగా భాగస్వామితో తన సంబంధాలు బాగానే ఉన్నాయా? సంతృప్తిగానే ఉందా? లేక పరిస్థితి ఎక్కడైనా గాడి తప్పుతోందా అన్న ఆలోచన రోజులో ఎన్నోసార్లు పలకరిస్తూనే ఉంటుంది. మన జీవితంలో శృంగారా నికి ఉన్న ప్రాముఖ్యం అంతటిది. కానీ దురదృష్టవశాత్తూ మన సమాజంలో లైంగిక ఆరోగ్యానికి దక్కాల్సినంత గౌరవం, మన్నన దక్కకుండా పోతున్నాయి.

మన సంస్కృతిలో సెక్స్ పట్ల రకరకాల వైరుధ్య భావనలు రాజ్యమేలుతున్నాయి. శృంగారం పట్ల అందరికీ ఆసక్తిఉంటుంది. అందరూ లైంగిక చర్యల పట్ల అనురక్తి కనబరుస్తూనే ఉంటారు. కానీ, శృంగారం గురించి బయటకు మాట్లాడటానికి వచ్చేసరికి మాత్రం అంతా 'ఛీ.. ఛీ అంటుంటారు. ఇలా చీదరించుకునే వారు, ముఖం చిట్లించుకునేవారు. ఇటువంటి విరుద్ధ భావాల్లో కొట్టుమిట్టాడుతూ ఉండేవారు. ఎప్పుడూ కూడా లైంగిక జీవి తంలో తాము పొందాల్సినంతటి ఆనందాన్ని పొందలేరు. భాగ స్వామికీ ఇవ్వాల్సినంతటి తృప్తిని ఇవ్వలేరు. శృంగారాన్ని అపోహల నుంచి బయటకు తీసుకువచ్చి దీన్నొక శాస్త్రంగా అర్థం చేసుకోవడం చాలా అవసరం. శృంగార వృక్షానికి చిన్నతనం నుంచే బీజాలు పడాలి. నవయవ్వనం నుంచీ వృద్ధాప్యం వరకూ ప్రతి దశలోనూ దాన్ని ఆరోగ్యకరంగా, బాధ్యతాయుతంగా పెంచి పోషించుకుంటూ రావాలి.

### పసివయసు ముచ్చట

ఆశ్చర్యకరంగా అనిపించినా... శృంగార,సాన్నిహిత్య భావనల పట్ల మనిషికి ఆసక్తి పసితనం నుంచే మొదలవుతుంది. ఇంట్లో తల్లిదండ్రులు ఒకరినొకరు తాకటం, కౌగిలించుకోవటం వంటి వన్నీ పిల్లలు బాల్యం నుంచే ఒక కంట గమనిస్తుంటారు. ఇలాంటి పిల్లల్లో ప్రేమాస్పదనమైన భావనలు సహజంగానే పుట్టుకొస్తుం టాయి. అసలు ఒకరిపై ఒకరు ఎలాంటి ప్రమలూ ప్రదర్శించని, ఎడమొగం పెడమొగంగా ఉండే తల్లిదండ్రుల మధ్య పెరిగిన పిల్లలు... పెద్దయ్యాక తామూ అంతే జడంగా తయారవుతుం టారు. కుటుంబంలో స్త్రీ పురుషుల మధ్య సంబంధాలు ఎంతటి అన్యోన్యంగా, ఆనందంగా ఉంటాయో తెలియకుండా పెరిగే పిల్లలు... బయటి ప్రపంచంలోకి అడుగుపెట్టినప్పుడు సరైన ఆలోచనా ధోరణి కొరవడి, ఏం చెయ్యాలో తెలియక... పెడతోవ పట్టే ప్రమాదం ఉంటుంది. పుస్తకాలను చదివి అరకొర విషయా లను నేర్చుకోవటం, సినిమాలను చూసి అదే నిజమని భావించ టం వంటివన్నీ వారిని రకరకాల సాహసాలకు పురిగొల్పుతుం టాయి. పసిబిడ్డలు తమ శరీరంలో ఇతరత్రా భాగాలను తాకి నట్టుగానే జననాంగాల మీదా చేతులు పెట్టుకోవడం సహజం.



మన జీవితంలో ఆకలి, నిద్ర మాదిరిగానే శృంగారం కూడా ఒక సహజాతం. సర్వ సహజ భావన. ఇదేమీ చెడ్డ విషయం కాదు. దీనికి మనం లేనిపోని పవిత్రత ఆపాదించి, నైతికపరమైన బంధనాల్లో ఇరికించటం వల్ల లైంగిక ఆరోగ్యం విషయంలో సమాజంలో లేనిపోని అపోహలు, అపనమ్మకాలు, అర్ధసత్యాలు, అసత్యాలు రాజ్యమేలుతున్నాయి. అయితే సహజాతం కదా అని మనిషి ఎలాంటి నిబంధనలూ, కట్టుబాట్లూ లేకుండా ఉండే పరిస్థితి లేదు. ఎందుకంటే ఇతర జంతుజాలం లాగా మనిషి కేవలం సంతానాన్ని కనేసి, సమాజానికి వదిలేసి వెళ్లిపోయే రకం కాదు. మనుషుల విషయంలో పెంపకానికీ అత్యధిక ప్రాధాన్యత ఉంది. ఇందులో స్త్రీపురుషులు ఇరువురికీ నిర్దిష్టమైన పాత్రలున్నాయి. కాబట్టి స్త్రీపురుషుల బాధ్యతలు పడక గదితో ముగిసిపోయేవి కాదు. తల్లిదండ్రులుగా ఆ తర్వాత కూడా వాళ్ల అంతకుమించిన బాధ్యతలను పోషించాల్సి ఉంటుంది. అందుకే మానవ సమాజానికి వచ్చేసరికి శృంగారానికి పద్ధతులు, నియమాలు పుట్టుకొచ్చాయి. వీటిని మనం కాదనలేం. అలాగని దురవగాహనల్లో కూరుకుపోలేం. శాస్త్రీయ దృక్పథంతో వీటన్నింటినీ పటాపంచలు చేసుకోకపోతే లైంగిక జీవితాన్ని ఆనందించాల్సినంతగా ఆస్వాదించలేమని చెప్పక తప్పదు. ఈ అవగాహన అన్నది పుస్తకాలతో వచ్చేది కాదు. ఇందుకు మొత్తం సామాజిక వైఖరిలోనే మార్పు రావాలి.

అందులో పెద్ద తప్పేమీ లేదు. కానీ దాన్ని చూస్తూనే ఇంట్లో పెద్దవాళ్ళు 'ఛీ ఛీ' అంటూ చటుక్కున చెయ్యి తీసే ఉంటుంది. ఇది ముమ్ముందు వాళ్ల లైంగిక ధోరణులను, ఆలోచనలను ఎంతో ప్రభావితం చేస్తుందని గుర్తించాలి. అందుకని ఇలాంటి విషయాల్లో పెద్దలు అవగాహనతో మెలుగుతూ... పిల్లలను చక్కటి 'రేపటి' కోసం సంసిద్ధం చెయ్యటం చాలా అవసరం.

## యవ్వన ఘడియలు

యుక్తవయసులో అడుగుపెట్టే తరుణంలో పిల్లల్లో శారీరకంగా, మానసికంగా ఎన్నో మార్పులు వస్తుంటాయి. కానీ మన సమాజంలో ఈ మార్పుల గురించి పిల్లలకు ఏ రకంగానూ సన్నద్ధం చెయ్యటం లేదు. దీనివల్ల ఏదో ఒక రోజు ఉన్నట్టుండి అబ్బాయి అంగం నుంచి తెల్లటి స్రావం వస్తుంటే చూసి గాభరా పడిపోవటం, ఆడపిల్లలైతే ఉన్నట్టుండి రుతుస్రావం జరిగితే తమకేదో జరిగిపోయిందని బెంబేలెత్తిపోవటం వంటి అనుభవాలు సర్వసాధారణమవుతున్నాయి. అప్పటివరకూ కేవలం మూత్ర విసర్జన మాత్రమే జరుగుతుంటే అవయవం నుంచి తెల్లటి, చిక్కటి స్రావం వస్తుంటే ఎవరు మాత్రం కంగారుపడరు? వీటి గురించి ముందే పిల్లలను మానసికంగా కొంత సంసిద్ధులను చేస్తే ఈ గందరగోళాలుండవు. జననాంగాల వద్ద సన్నటి రోమాలు మొలుస్తుండటం, అమ్మాయిల్లో రొమ్ములు పెరగటం.. ఇలాంటివన్నీ సహజైన మార్పులని పిల్లలకు కాస్తముందే నుంచే అవగాహన ఉండాలి. అబ్బాయిలకు ఉదయాన్నే నిద్రలేవటానికి ముందు అంగం గట్టిపడుతుండొచ్చు. ఆడపిల్లలకు తమ జననాంగాలను ముట్టుకోవాలని అనిపిస్తుండొచ్చు. ఇలాంటి మార్పులను చూసి పిల్లలు ఆశ్చర్యానికి, భయభ్రాంతుకు, లేదంటే సిగ్గుపడే పరిస్థితులు ఉండకూడదు. కాబట్టి పిల్లలు యుక్తవయసుకు దగ్గర అవుతున్న దశలోనే తల్లిదండ్రులు వారితో అనునయంగా మాట్లాడుతూ మీ శరీరాల్లో ముమ్ముందు ఇలాంటి మార్పులు వచ్చే అవకాశం ఉంది. ఇవి ప్రకృతి సహజమైన మార్పులే, మనల్ని పునరుత్పత్తి, సంతానం కోసం... సరికొత్త పాత్రల కోసం సంసిద్ధం చేసే మార్పులివి.. అని వివరిస్తే పిల్లల మనసుల్లో గందరగోళాలకు, లేనిపోని కుతూహలాలకు ఆస్కారం ఉండదు. అమ్మాయిలకు రుతుక్రమం గురించి, ఆ సమయంలో తీసుకోవాల్సిన జాగ్రత్తల గురించి కూడా వివరించటం చాలా అవసరం. తల్లిదండ్రుఈ పని చెయ్యకపోతే.. వాళ్లు స్నేహితుల ద్వారానో, పుస్తకాలు చదివో ఏవేవో అరకొర విషయాలు తెలుసుకుని, అవే నిజమనుకొని భ్రమల్లోనూ, భయాల్లోనూ కూరుకుని తమ విలువైన సమయాన్ని వృథా చేసుకునే ప్రమాదముంది. ఇవన్నీ ముమ్ముందు లైంగిక ఆరోగ్యంపై తీవ్రమైన ప్రభావం చూపుతాయని గుర్తించాలి.

## బాధ్యతాయుత దాంపత్యం

శృంగారమన్నది ఏ మాత్రం చీకటి వ్యవహారం కాదు. ఆబగా, ఆదరాబాదరగా కానిచ్చే పని అంతకంటే కాదు. ముఖ్యంగా పెళ్ళయిన తర్వాత మరింత బాధ్యతగా మెలగాల్సిన అవసరముంటుంది. సెక్సు అంటే అంగాంగ సంభోగం ఒక్కటే కాదు. భాగస్వామిని అర్థం చేసుకోవటం, ఇష్టాయిష్టాలను గౌరవించటం వంటి ఎన్నో అంశాలతో ముడిపడిన వ్యవహారమన్న విస్తృతమైన అవగాహన ఉండాలి. అప్పుడే సెక్స్‌ను మరింతగా ఆస్వాదించే అవకాశముంది. నిజానికి పెళ్ళయిన కొత్తలో దంపతులకు అంతా కొత్తగా ఉంటుంది. అంతకుముందు పుస్తకాల్లో చదివిన విషయాలకూ, తమకు అనుభవంలో ఎదురవుతున్న పరిణామాలకూ పొంతన ఉండకపోవచ్చు. అప్పటికే నీలి చిత్రాల వంటివి చూసిన కొందరు.. తమ జీవితం అలా లేదేంటని నిరాశలోకి జారి, జావగారిపోతుంటారు. బయటికి చెప్పుకోలేక లోలోపలే మథన పడుతుంటారు. అంగ ప్రవేశానికి భాగస్వామి సహాయం అవసరమన్న విషయం కూడా చాలామందికి తెలియదు. కాబట్టి నూతన దంపతులకు ముందు నుంచే లైంగిక ఆరోగ్యంపై చక్కటి అవగాహన ఉండటం అవసరం. శృంగారమన్నది ఒక బాధ్యతాయుత



మైన చర్య అన్న విషయం వారికి తెలిసి ఉండాలి. వెంటనే సంతానం కనాలా వద్దా? వద్దనుకుంటే ఎలాంటి గర్భనిరోధక సాధనాలు వాడాలి? ఈ క్రమంలో ఎలాంటి సమస్యలు తలెత్తవచ్చు? అవాంఛిత గర్భాలంటే ఏమిటి? ఇవన్నీ ముందే తెలియాలి. అలాగే అపోహల్లో కూరుకోకూడదు. ఫలానా నెలలో ఫలానా పూర్ణిమ రోజు కలిస్తే ఏదో అయిపోతుందని చెప్పటం వంటి లక్షలాది అపోహ మన సమాజంలో రాజ్యమేలుతున్నాయి. వీటివల్ల శాస్త్రీయ దృక్పథం కొరవడుతుంది. శృంగారమన్నది బాధ్యతతో కూడిన, ఆనందదాయకమైన చర్య అన్న అవగాహన పెరగాలి. అర్థవంతమైన సంబంధాల్లోనే అన్యోన్యత, ఆప్యాయత లుంటాయన్న విషయం తెలుసుకోవాలి. శృంగారాన్ని తేలికగా తీసుకునే వాళ్లు కూడా. బంధాలను దాటి.. బయటి మార్గాలను తొక్కుతున్నప్పుడు సురక్షిత విధానాలను, బాధ్యతలను గుర్తెరిగి ప్రవర్తించటం చాలా అవసరం.

## వయసుఏని వ్యవహారం

శృంగారానికి వయసేమీ ఉండదు. మనుషులు పూర్తి ముదుసలి వయసులో కూడా శృంగార భావనలను ఆస్వాదించొచ్చు. ఇది సహజం. సర్వసాధారణం కూడా. ఇందులో తప్పేమీ లేదు. పండువయసులో ఇదేమిటని సిగ్గుపడాల్సిన పనిలేదు. నిజానికి ఆ వయసుకు వచ్చేసరికి ఆసక్తులు మారొచ్చు. ఒకప్పటిలా చుకుదనం. స్తంభనలు ఉండకపోవచ్చు. శృంగారమంటే అంగాంగ సంభోగమే అని భావించటం పొరపాటు. భాగస్వామిని స్పృశించటం, హత్తుకోవటం, చివరికి చేతి మీద చేయి వేసి ప్రేమగా నిమరటం కూడా ఎంతో అనిర్వచనీయమనై శృంగార భావనను, తృప్తినీ ఇవ్వచ్చు. నూరేళ్ల వయసులోనూ తమ శృంగార జీవితం ఆనందభరితంగా ఉందని చెప్పేవాళ్లు ఎంతోమంది ఉన్నారు. యికానీ కొందరు మాత్రం దీన్ని తప్పుగా భావిస్తూ ఈ వయసులో మాకేమిటీ ఆలోచనలని వైద్యులను సంప్రదిస్తుంటారు. ఇది సహజమని, ఆరోగ్యకరమైన అంశమేనని గుర్తించాలి. కాకపోతే వృద్ధాప్యంలో చాలామంది భాగస్వామి దూరమై, నిర్వేదంలోకి జారిపోతుంటారు. ఇలాంటి వారికి డిల్డొలు, వైబ్రేటర్లు వంటి 'సెక్స్ టాయ్స్' ఉపయోగపడతాయి. వీటిని చీదరించుకోవాల్సిన అవసరం లేదు. వీరి గురించి నైతికమైన తీర్పులు ఇవ్వటం, వారి మీద లేనిపోని ముద్రలు వేయటం తగదు. అది వారి వైయక్తిక నిర్ణయం. ఎవరైనా సామాజికమైన, చట్టబద్ధమైన కట్టుబాట్లను అతిక్రమించనంత వరకు వారి జీవితాల్లో ప్రవేశించటం, వారిని విమర్శించటం, జోక్యం చేసుకోవటం కూడా తగదు.

## ఈ రెండూ పోవాలి!

శృంగారం అనగానే దాన్నో మురికిపనిలా చూస్తూ 'ఛీ ఛీ' అనటం... లేదంటే దాన్నో 'మజా, థ్రిల్లు' వ్యవహారంగా చూడటం.. ఈ రెండూ ధోరణులూ తప్పే. ఈ రెండూ పోవాలి. ఏ నాగరిక సమాజమూ కూడా శృంగారాన్ని ఛీఛీ అనదు. దాన్ని మానవ జీవితాల్లో అత్యంత కీలకమైన అంశంగా స్వీకరిస్తుంది. అంతేకాదు, దాన్ని సామాజిక జీవితంలోనూ ముఖ్యమైన అంశంగా గుర్తిస్తుంది. మన పూర్వీకులు కూడా శృంగారాన్ని ఓ అత్యద్భుతకార్యంగా భావించారు. దాన్నో శాస్త్రంలాగా, మానవ మనుగడకు అవసరమైన గౌరవప్రదమైన విజ్ఞానంగా గుర్తించారు. కామసూత్రమే ఇందుకు తార్కాణం. ఇంతటి విశాల దృక్పథం కాస్తా కాలక్రమంలో కుచించుకుపోయి... క్రమేపీ అపోహల్లోకీ, అర్థరహిత భావనల్లోకి జారిపోయింది. దీంతో శృంగారమన్నది అన్యోన్నయమైన ఆనందాన్నిచ్చే అంశమని కూడా చాలామంది తెలుసుకోవటం లేదు. అదేదో హడావుడిగా చీకట్లో ముగించెయ్యాలన్న తొందరపాటు ధోరణిలో కొట్టుకుపోయే వారూ ఉన్నారు. నిజమైన శృంగారం ఆరోగ్యకరమైన సంబంధ బాంధవ్యాలను ప్రోత్సహిస్తుంది.

## ఇది 'విద్య' కాదు!

ప్రస్తుతం విద్యార్థులకు లైంగిక విద్య పేరుతో జరుగుతున్న బోధన ఎందుకూ కొరగాకుండా ఉంది. అసలు దీన్ని బోధిస్తున్న వారిలో సంకుచిత, సంప్రదాయ ధోరణలు గలవారే ఎక్కువ. ఆ పుస్తకాల్లో పిల్లలు ఎన్నడూ చూడని అండాశయాలు, వృషణాల వంటి స్త్రీ పురుష, జననాంగ అంతర్భాగాలవో, అండం, తోకతో తిరుగుతున్నట్టుండే శుక్ర కణం వంటి బొమ్మను చూపించి ఏదో తూతూమంత్రంగా చెప్పేశామని అనిపించటం వల్ల.. కుతూహలం ఎక్కువగా ఉండే వారి బుర్రల్లో గందరగోళం పెరుగుతోంది. ఆ బొమ్మకులూ, నిజజీవితంలో వాళ్లు చూసుకునే వాస్తవ శరీర భాగాలకూ మధ్య ఎక్కడా పొంతనే లేక పిల్లలు గందరగోళంలో పడిపోవటం... లేదంటే అసలు మొత్తానికే పట్టించుకపోవటం.. ఇలా ఏదో ఒకటి జరుగుతుంది. లైంగిక విద్య అన్నది తమ మనసుల్లో రేగుతున్న శృంగార భావనలను, ఆ మార్పులను, వాంఛలను అర్థం చేసుకునే దిశగా సహాయపడాలి. శృంగారమన్నది బంధాలను బలపరుస్తుందని, అది ప్రేమాస్పదమైనదని, అది ఆనందదాయకమైనదని, అలాగే అది ఎంతో బాధ్యతాయుత మైనదని కూడా తెలిసేలా ఉండాలి. శృంగార చర్యల పర్యావసానం, ఆ తర్వాతి పరిణామాలు ఎలా ఉంటాయన్నది తెలుసుకుని వాళ్లు బాధ్యతగా మెలిగేందుకు దోహదం చెయ్యాలి.



# పెళ్ళి పందిరి



అంతరించిపోయిన అపురూప దృశ్యాల జాబితాలో
పాపం 'పెళ్ళిపందిరి' కూడా చేరిపోయినట్లుంది
ఓ పాతికేళ్ళ క్రితం వరకు - ఇంట్లో పెళ్ళి అంటే
అన్నింటికంటె ముందు కనిపించేది 'పెళ్ళి పందిరే'
పెళ్ళి ముహూర్త; సమయ సందర్భాన్ని బట్టి
పందిళ్ళ స్పెషలిస్టులైన
మేనమామలు, చిన్నాన్నలు పెళ్ళింట్లో దిగిపోయేవాళ్ళు
సైజులుగా నరికిన సర్వేబాజులను నేలలో పాతి
వెదురుగెడలను కొబ్బరి తాడుతో కట్టి
కాబోయే భార్యభర్తల బంధాన్ని గుర్తుచేసేవారు,
వెదురుగెడలతో అల్లిన పందిరిపైన
పచ్చని తాటాకులు వేసి పదిలంగా నేసేవారు -
కాబోయే వధూవరుల సంసారం
పదికాలాలు పచ్చగా ఉండాలని కోరుకుంటూ,
మామిడాకుల తోరణాలు - కొబ్బరాకుల పట్టీలు
అత్తాలతో ఉన్న అరటిగెలల బోదెలు కట్టి
పెళ్ళికూతురి కన్నా ముందు
'పెళ్ళి పందిరి'నే ముస్తాబు చేసేవారు,
ఫలానా వాళ్ళింట్లో పెళ్ళి అని - ముందుగా
పదిమందికీ ప్రచారం చేసే 'పెళ్ళిపందిరి'
పెళ్ళయ్యాక కూడా పక్షం రోజులుపైగా కళకళలాడుతూ
ఆ ఇంట్లో జరిగిన శుభకార్యానికి
ఏకైక గురుతునన్నట్టు గర్వంగా నిలబడేది
మరిప్పుడా 'పెళ్ళి పందిరి'కి విడాకులిచ్చేసారు
పెళ్ళిళ్ళన్నీ కళ్యాణమండపాలు, ఫంక్షన్ హాల్స్‌కు
మకాం మార్చేసాయి - దాంతో
పెళ్ళివాళ్ళింట్లో బంధు;మిత్రుల పలకరింపులు కూడా
ముఖం చాటేసాయి


రచన
**డా॥ వి. రాజేంద్రప్రసాద్**
ఆంధ్రాబ్యాంకు ఎదుట, అశోక్‌నగర్,
ఏలూరు-534 002
సెల్ : 76759 73777



# ఒత్తిళ్ళు భరించలేక ఆగిపోతున్న అంగన్‌వాడీ వర్కర్ల ఊపిరి

## అదనపు పనిభారంతో అవస్థలు పడుతున్న కార్యకర్తలు





మహిళా స్త్రీ శిశు సంక్షేమ శాఖలో పెరిగిన విపరీతమైన పని భారంతో చాలామంది అంగన్‌వాడీ కార్యకర్తలు వత్తిళ్ళు తట్టుకోలేక అసువు బాసుతున్నారు. జాబ్ చార్ట్‌తో సంబంధం లేకుండా ఇతర శాఖలకు సంబంధించిన పనులు వీరికి అప్పగించి తీవ్ర ఒత్తిడికి గురి చేస్తున్నారని అంగన్‌వాడీలు వాపో తున్నారు. అప్పుడు కుమారి మొన్న టికి మొన్న రాయదుర్గం మండలం రాతి బావి వంక గ్రామానికి చెందిన కార్యకర్త తిప్పక్క నిన్న గుంటూరు జిల్లా వినుకొండ ప్రాజెక్టు వర్కర్ పద్మ నేడు పశ్చిమ గోదావరి జిల్లా పెదపాడుకు చెందిన కార్యకర్త ఝాన్సీరాణి కేవ లం వీరందరూ వారిపైఉన్న ఒత్తిళ్ళ కారణంగానే మరణించారని స్థానికులతోపాటు కుటుంబ సభ్యులు చెపుతున్నారు. వీరి మాట అలా ఉంచితే విధి నిర్వ హణలో వత్తిళ్ళు భరించలేక అనారోగ్యానికి గురి అవుతున్న వాళ్ళు వందల్లోనే ఉన్నారు. మునుపెన్నడూ లేనివిధంగా డిపార్టు మెంటులో పనిఒత్తిడి బాగా పెరిగింది. ఒక్క కార్యకర్తనే కాదు సూపర్‌వైజర్లు, సిడిపిఒలు సైతం ఎంతో మనోవేదన చెందు తున్నారు. చింతూరు పిఒ గీత సంఘటన మరవకముందే రాష్ట్ర వ్యాప్తంగా అంగన్‌వాడీ కార్యకర్తలు నలుగురు పైగా చనిపోవటం చాలా బాధాకరం. ఈ విషయంలో యూనియన్లు సైతం మిన్న కుండిపోయాయి తప్ప సరైన కార్యాచరణ అమలు చేయటంలో వెనుకబడే ఉన్నారు. మహిళా శాఖలో మహిళలకు రక్షణ లేనంత ఇదిగా పరిస్థితులు మారిపోయినాయి. ఒక విధంగా చెప్పాలంటే మానవహక్కుల ఉల్లంఘన ఈ శాఖలో జరుగుతుంది అని చెప్ప టానికి ఎన్నో ఉదాహరణలు ఉన్నాయి. పనిభారం ఒకవైపు – వేధింపులు మరోవైపు ఈ రెండిటితో సతమతమవుతున్నారు. మహిళా ఉద్యోగిణులు ఆదిరాలు, సెలవు దినాలు అని కూడా లేకుండా లెక్కకు మించి ఎన్నో అదనపు గంటలు పనిచేయాల్సి వస్తుందని ఉద్యోగులు ఆవేదన చెందుతు న్నారు. ఏ ఇతర ప్రభుత్వ శాఖల్లోనూ లేనివిధంగా ఒక్క ఐసిడి ఎస్‌లోనే ఈవిధంగా ఉందని ఆందోళన చెందుతున్నారు. ఆన్‌లైన్ పేరుతో ఎప్పుడు ఏ నివేదిక అడుగుతారో తెలియని పరిస్థితి. పోనీ ఆ నివేదిక అందజేస్తే ఆ ఫార్మెట్‌లో కాదు వేరే ఫార్మేట్‌లో ఇమ్మంటారు. ఇక అంగన్‌వాడీ కార్యకర్త విషయానికి వస్తే వారి ఉద్యోగం మరీ నరకం. వారిపై ప్రతివారు పెత్తనం చేయడమే. క్షేత్రస్థాయిలో ఎక్కువ నిందలు ఒత్తిళ్ళు భరించేది కార్యకర్త మాత్రమే. ఈమె చాలామందికి జవాబుదారితనంగా ఉండాలి. ఈమెకు ఈమె ఒక్క ఉద్యోగమే కాదు. మెడికల్ వాళ్ళు, రెవెన్యూ వాళ్ళు విధుల్లో కూడా భాగస్వామ్యం వహించాలి. లేదంటే వేధింపులే జీతాలు పెరిగినవి అన్నమాటేగాని ఏమాత్రం సంతోషం లేదని టెన్షన్లకు గురిచేసి తమను అనారోగ్యవంతులుగా చేయటానికే జీతాలు పెంచారని ఆవేదన చెందుతున్నారు. నిన్న మొన్నటివరకు తమ కళ్ళ ఎదుట మాలో ఒక కార్యకర్తగా తిరిగిన ఆమె గుండె ఆగి తమకళ్ళ ముందే విగత జీవిగా మారటం తాము జీర్ణించుకోలేక పోతున్నామంటున్నారు. ఎటువంటి ఉద్యోగ భద్రతలేని మా బతుకులు తెల్లారిపోతే తమ బిడ్డల భవిష్యత్ ఏమికావాలని సర్కారుని నిలదీస్తున్నారు. ఎన్నో ఏళ్ళుగా దానినే నమ్ముకుని చాలీచాలని వేతనాలతో కాలం గడుపుతున్న మాపై ప్రభుత్వం విపరీతమైన పనిభారం పెంచి మానసిక ఒత్తిళ్ళకు గురి చేయటం సబబుకాదని కోరుతున్నారు. విధుల్లో ఉండగా మరణించిన కార్యకర్త స్థానంలో ఆమె కుటుంబంలో ఎవరికో ఒకరికి ఉపాధి కల్పించాలని వేడుకొనుచున్నారు. ఉదయం లేచింది



మొదలు కాలంతో పనిలేకుండా అంగన్‌వాడీ వర్కర్ డ్యూటీకే అంకితం అవుతున్నామని కుటుంబ జీవితం కూడా ఉండటం లేదంటున్నారు. ఈ విషయంలో అధికారులు ఆలో చించి చిరు ద్యోగులమైన మాపై వేధింపులు, ఒత్తిళ్ళు తగ్గించాలని అంగన్ వాడీలు కోరుతున్నారు. అలాగే వేతనాలు సకాలంలో అందక అప్పులు పాలు అవుతున్నామని ఇచ్చేది ఏదో సరైన సమయంలో ఇస్తే ఉపయోగంగా ఉంటుందన్నారు. ముఖ్యంగా చనిపోయిన కార్యకర్తలకు ప్రభుత్వం నుండి ఏదైనా ఆర్థిక సహా యం ఇప్పించి వారి కుటుంబాలను ఆదుకోవాలని కోరుతున్నారు. అంగన్‌వాడీల ఆరోగ్య సమస్యలపై కూడా అధికారులు దృష్టి సారించి ఎప్పటికప్పుడు వైద్య పరీక్షలు చేయించుకునే సౌలభ్యం కూడా కల్పించాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

# కిషోరి వికాసం బాలికలకు వరం : మంత్రి సునీత

## కిషోరి వికాసం ఫేజ్ II ప్రారంభం

మానవ అక్రమ రవాణాలో మన రాష్ట్రం దేశంలోనే 2వ స్థానంలో ఉందని కిషోరి వికాసం లాంటి కార్యక్రమాల ద్వారా కొంత మార్పును తీసుకువస్తున్నామని మొదటి విడతలో మంచి ఫలితాలు సాధించామని మంత్రి పరిటాల సునీత అన్నారు. ఇటీవల కృష్ణా జిల్లా విజయవాడలో కిషోరి వికాసం రెండవ విడత కార్యక్రమాన్ని ప్రారంభించారు. కార్యక్రమానికి ముఖ్య అతిథిగా హాజరైన మంత్రి మాట్లాడుతూ రాష్ట్రమంతా 22 లక్షల మంది అమ్మాయిలకు కిషోరి వికాసం 2వ విడత కార్యక్రమంలో లింగ అవగాహన, ఋతు ఆరోగ్యం, పరిశుభ్రత పోషణ మరియు ఇతర సాంఘిక సమస్యలపై అవగాహన కల్పిస్తామన్నారు. వీరందరి నిమిత్తం గ్రూపు రిసోర్స్ పర్సన్‌లకు అధికారులను నియమించామన్నారు. మొదటి విడత 2017 సంవత్సరంలో ప్రభుత్వం ప్రారంభించిందని 14-18 ఏళ్ళ వయసున్న కౌమార బాలికలకు వివిధ అంశాలపై అవగాహన కల్పించి విజయాన్ని సాధించామన్నారు. మొదటి విడత వచ్చిన ఫలితాలు ఆశాజన కంగా ఉండటంలో రెండవ విడత కూడా ప్రారంభించామన్నారు. రాష్ట్రంలో కౌమార బాలికలు అడుగడుగునా ఎక్కడో ఒకచోట అన్యాయానికి గురవుతున్నారని అలాంటి వారికి ఈ కార్యక్ర మాలు ఎంతగానో ఉపయోగపడతాయన్నారు. సమాజంలో మహిళలు పట్ల గౌరవ మర్యాదలతో మెలగాలని హితవు పలి కారు. చాలామంది తెలిసి తెలియని వయస్సులో ప్రేమ పేరుతో మోసపోతున్నారని వారి విలువైన భవిష్యత్తును నాశనం చేసుకుని తల్లిదండ్రులకు తీరని శోకాన్ని మిగిలుస్తున్నారన్నారు. ఈ విధానంలో మార్పు రావటం కోసమే ఈ కార్యక్రమం ముఖ్య ఉద్దేశ్యమన్నారు. మొదటి దశలో 900 పాఠశాలల్లో 2 లక్షల మంది బాలికలకు శిక్షణ ఇచ్చామన్నారు. రెండవ దశలో 11,000 పాఠశాలలు ఉన్నాయని 22 లక్షల మంది బాలికలకు శిక్షణ ఇవ్వనున్నట్లు మంత్రి చెప్పారు. కమిషనర్ హెచ్ అరుణ



కుమార్ మాట్లాడుతూ మొదటిదశలో ఎదుర్కొన్న అవరోధాలను అధికమించి రెండవ విడత విజయవంతంగా అమలు చేయాల న్నారు. రెండవ విడతలో కొన్ని మార్పులు సైతం చేసామన్నారు. ముఖ్యంగా విద్యార్థినులు ఇతర విద్యార్థినులకు శిక్షణ ఇస్తారని ఇలా చేయటం వల్ల పరస్పర చర్య వారికి ఉపయోగకరంగా ఉంటుందన్నారు. కార్యక్రమంలో రీజనల్ జాయింట్ డైరెక్టర్ టివి శ్రీనివాస్, పిడి కృష్ణకుమారి సిడిపిఒలు, సిబ్బంది, అంగన్‌వాడీలు పాల్గొన్నారు.

## ఏపీకి 8 జాతీయ పురస్కారాలు

జాతీయ పోషకాహార మిషన్ అమలులో ఆంధ్రప్రదేశ్‌కి జాతీయస్థాయిలో 8 పురస్కారాలు లభించాయి. జాతీయస్థాయిలో సెప్టెంబర్‌ను పోషణ మాసంగా కేంద్రం ప్రకటించి ఆ నెలలో మాతా, శిశు ఆరోగ్యం, పౌష్టికాహారం, రక్తహీనత అంశాలపై ప్రజల్లో అవగాహన కల్పించాలని అన్ని రాష్ట్రాలను ఆదేశించింది. ఇందులో భాగంగా ఆంధ్రప్రదేశ్‌లో జనచైతన్యం పేరుతో పలు కార్యక్రమాలను చేపట్టినట్లు రాష్ట్ర మహిళాభివృద్ధి శిశు సంక్షేమశాఖ ప్రత్యేక కమిషనర్ అరుణ్‌కుమార్ తెలిపారు.

# అంగన్‌వాడీల్లో దసరా వేడుకలు





శరన్నవరాత్రి మహోత్సవాల సందర్భంగా అనంతపురం జిల్లా కణికల్ ప్రాజెక్టు పరిధిలోని కొలగనహళి గ్రామంలోని మెర్జిడ్ అంగన్‌వాడీ కేంద్రంలో దసరా వేడుకలు ఘనంగా నిర్వహించారు. బాల్య దశ నుండే విద్యార్థినీ విద్యార్థులకు వివిధ రకాలైన సంప్రదాయ పండుగల విశిష్టతను తెలియజేసేం దుకు ఇలాంటి వేడుకలు దోహదపడతాయన్నారు. అంగన్‌వాడీ కేంద్రం లోనే అమ్మవారి ఫొటో పెట్టి దసరా బొమ్మల కొలువును సైతం ఏర్పాటు చేసారు. చిన్నారులంతా సంప్రదాయ దుస్తుల్లో అమ్మవారికి ప్రత్యేక పూజలు చేసారు. ప్రీస్కూల్ బాలికలు ప్రత్యేక ఆకర్షణగా చీరలు కట్టుకుని అమ్మవారి చుట్టూ ప్రదక్షిణలు చేసారు. ఈ సందర్భంగా అంగన్‌వాడీ కార్యకర్తలు దసరా పండుగ యొక్క విశిష్టతను, దసరా ఎందుకు ఆచరించాల్సి వచ్చిందో చారిత్రక విశేషాలను చిన్నారులకు వివరించారు. సర్వ మతాల సారాంశం ఒక్కటే అని చాటిచెప్పే విధంగా ఈ వేడుకల నిర్వహించడం ముదావహం అని స్థానికులు అభినందించారు.

# రూ.6 వేల కోట్లతో పోషకాహార పథకాల అమలు

గ్రామాల్లో పోషకాహార పథకాలు అమలు కోసం కేంద్రం ఏటా రూ. 6 వేల కోట్లు ఖర్చు చేస్తున్నట్లు కేంద్ర గిరిజన వ్యవహారాల మంత్రిత్వశాఖ డైరెక్టర్ డాక్టర్ ఎ అనిల్‌కుమార్ తెలిపారు. పశ్చిమగోదావరి జిల్లా బుట్టాయిగూడెం మండలంలోని కొవ్వాడ అంగన్‌వాడీ కేంద్రాన్ని ఇటీవల ఆయన సందర్శించారు. కేఆర్ పురం ఐటిడిఎ వద్ద గిరిజన మహిళలు నిర్వహిస్తున్న చిరుధాన్యాలతో బిస్కెట్ల తయారీ కేంద్రాన్ని పరిశీలించారు. బూసరాజుపల్లి ఏపీ గిరిజన గురుకుల బాలికల ఉన్నత పాఠశాలలో విద్యార్థినులతో మాట్లాడారు. అంగన్‌వాడీ కార్యకర్తలు ఏర్పాటు చేసిన పోషకాహా రాల ప్రదర్శనను తిలకించారు. ఆయన విలేకరులతో మాట్లాడుతూ పోషకాహార పథకాల అమలు కోసం కేంద్రంతో పాటు ఆయా రాష్ట్రాల ప్రభుత్వాలు మరిన్ని నిధులు అదనంగా కేటాయిస్తున్నట్లు పేర్కొన్నారు. పశ్చిమగోదావరి జిల్లా మరుగుదొడ్ల నిర్మాణం, వినియోగంలో ముందంజలో ఉందని ప్రశంసించారు. ఇక్కడి ప్రజలు అవగాహనతో చైతన్యవంతులై ఆదర్శంగా నిలిచా రని అభినందించారు. జిల్లాలోని అంగన్‌వాడీ కేంద్రాల్లో గర్భిణులు, బాలింతలు, చిన్నపిల్లలకు నేరుగా పోషకాహారం అందుతుందన్నారు. ఈ విధానం మాతృ, శిశుమరణాలను అరికట్టేందుకు చాలా ఉపయోగపడుతుందని పేర్కొన్నారు. అనంతరం అంగన్‌వాడీ కార్యకర్తలు వైద్య సిబ్బందితో సమావేశమయ్యారు. పోషకాహారంతో తల్లీబిడ్డల ఆరోగ్యం సంరక్షణకు కృషి చేయాలని కోరారు. అనంతరం డైరెక్టర్ అనిల్‌కుమార్‌ను ఘనంగా సన్మానించారు. ఏపీ గిరిజన సంక్షేమ వైద్య విభాగం ఉపసంచాలకుడు చిన్నబాబు, సీనియర్ సమన్వయాధికారి డిఎన్ మూర్తి, గిరిజనాభివృద్ధిశాఖ సమన్వయాధికారి మధుసూధనరావు, ఐటిడిఎ ఎపివో సిహెచ్ శ్రీనివాసరావు, సిడిపివో విజయఫ్లారెన్స్ పాల్గొన్నారు.

# పిల్లల ఉసురుతీస్తున్న పేదరికం

పేదరికం శాపంగా మారి పసిపిల్లల్ని పొట్టనపెట్టుకుంటున్న ఘటనలు ఇటీవల తరచూ వెలుగు చూస్తున్నాయి. దేశ రాజధానిలో కొంతకాలం క్రితం చోటుచేసుకున్న ఆకలి చావులు సర్వత్రా చర్చనీయాంశమయ్యాయి. కటిక పేద కుటుంబంలో జన్మించిన రెండేళ్ల వయసున్న సుఖో, నాలుగేళ్ల పరో, ఎనిమిదేళ్ల మాన్సి అనే ముగ్గురు చిన్నారులు ఆకలికి అలమటించి నేల రాలారు. పిల్లల పేగుల్లో సైతం నీరు ఇంకిపోయిందని, ఏ మాత్రం కొవ్వు లేదని లాల్‌బహదూర్ శాస్త్రి ఆసుపత్రి వర్గాలు వెల్లడించిన వివరాలు అందరి హృదయాలనూ కలచివేశాయి. ఇలాంటి ఘటనలు దేశం నలుమూలలా జరుగుతున్నాయి, వెలుగులోకి వస్తున్నవి కొన్నే! 'యునిసెఫ్' 2016 వార్షిక నివేదిక ప్రకారం భారత్‌లో 2015లో 2.57 కోట్లమంది జన్మించారని- అందులో 12లక్షల మంది చిన్నారులు మరణించారని పేర్కొంది. బాలల సంరక్షణ కోసం ప్రభుత్వాలు అనేక సంక్షేమ కార్యక్రమాలు ప్రవేశపెట్టినప్పటికీ, అవి ఏమాత్రం పేద ప్రజలకు చేరడం లేదన్న వాస్తవాన్ని బయటపెట్టిన నివేదిక అది.

## ఏదీ పౌష్టికాహారం?

ప్రబల ఆర్థిక శక్తిగా ఎదిగేందుకు నిర్విరామ ప్రయత్నాలు చేస్తున్న భారత్‌ను దారిద్ర్యం ఇప్పటికీ పట్టిపీడిస్తూనే ఉంది. ఉత్తర కొరియా, బంగ్లాదేశ్‌ల కంటే భారత్‌లోనే ఆకలి తీవ్రత ఎక్కువగా ఉంది. నిరుడు ప్రకటించిన ప్రపంచ ఆకలి సూచీలోని 119 దేశాల జాబితాలో భారత్ 100వ స్థానంలో ఉండటమే ఇందుకు దాఖలా. ఆహార విధాన పరిశోధన సంస్థ 2015-16 నివేదిక ప్రకారం 2008 నుంచి భారత స్థాయి ఏయేటికాయేడు దిగజారుతూ వస్తోంది. తొమ్మిదేళ్ల కిందట 35.6 పాయింట్లతో ఉన్న భారత్ ఇప్పుడు 31.4 పాయింట్లకు పతనమైంది. ఈ స్కోరు 28.5కి చేరినట్లయితే దేశం అత్యంత ప్రమాద పరిస్థితులకు చేరే అవకాశం ఉందన్నది ఆర్థికవేత్తల అభిప్రాయం. ప్రపంచంలో ఆకలితో అలమటించే అన్నార్తుల సంఖ్య క్రమంగా పెరుగుతోంది. 2015లో 77.7 కోట్లమంది అన్నార్తులు ఉండగా- 2016నాటికి ఆ సంఖ్య 81.5 కోట్లకు చేరింది. అంటే ఏడాది కాలంలోనే ఆ సంఖ్య 3.8 కోట్లు పెరగడం నివ్వెరపరచే విషయం. భారత్‌లో ప్రస్తుతం 20 కోట్ల మంది అర్ధాకలితో అలమటిస్తున్నారని వివిధ అధ్యయనాల్లో వెల్లడైంది.

## విస్తరిస్తున్న ఆకలి సమస్య



పేదల ఆకలి తీర్చేందుకు 2013లో జాతీయ ఆహార భద్రత చట్టాన్ని అమలులోకి తీసుకువచ్చారు. కానీ, అది సక్రమంగా అమలు కావడం లేదు. కరవు పీడిత ప్రాంతాలపై ప్రత్యేక శ్రద్ధ పెట్టి ఈ పథకాన్ని పాలకులు ముందుకు తీసుకువెళ్ళాల్సి వుంది. గ్రామీణ ప్రాంతాల్లో 75 శాతం, పట్టణ ప్రాంతాల్లో 50 శాతం పేదలకు అక్కరకొచ్చేలా ఈ చట్టంలో విధి విధానాలు రూపొందించినా ఆచరణలో అవి వట్టిపోతున్నాయి. పిల్లలకు, మహిళలకు సంపూర్ణ ఆహారం పొందే హక్కు ఉన్నప్పటికీ అనేక రాష్ట్రాల్లో ఆ హక్కుకు భద్రతలేని పరిస్థితులు నెలకొన్నాయి. దేశంలో ప్రస్తుతం సుమారు 81 కోట్లమందికి సబ్సిడీ మీద ఆహార పదార్థాలు అందుతున్నాయని అంచనా. కుటుంబంలోని ప్రతి మనిషికీ అయిదు కిలోలు, అంత్యోదయ అన్న యోజన కుటుంబాలకు 35 కిలోల మేర ఆహార పదార్థాలు రాయితీకి అందజేయాలి. అవినీతికి అలవాటుపడిన అధికారుల అండదండలతో సబ్సిడీ పదార్థాలను అక్రమార్కులు దొడ్డిదారిన తరలించి సొమ్ము చేసుకుంటున్నారు. కేంద్ర ప్రభుత్వం వార్షిక బడ్జెట్లలో 2014 నుంచి 2019 మధ్యకాలంలో ఆరు లక్షల డెబ్బై ఆరు వేల 928 కోట్ల రూపాయలను సబ్సిడీ ఆహార పదార్థాల కోసం కేటాయించింది. ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్న చందంగా సంక్షేమ ఫలాలు పేదలందరికీ పూర్తి స్థాయిలో చేరడం లేదన్నది సుస్పష్టం. దేశంలోని చిన్నారులను పోషకాహార లోపం వెన్నాడుతోంది. ఆరు నెలలనుంచి 24 నెలల వయసు ఉన్న చిన్నారుల్లో ప్రతి పదిమందిలో తొమ్మిదిమంది పౌష్టికాహార లోపంతో బాధపడుతున్నారని నిరుడు వెలువడిన జాతీయ కుటుంబ సర్వే వెల్లడిం





చింది. తగినంత ఆహారం అందుబాటులో లేకపోవడం, ఉన్న ఆహారమూ నాణ్యమైనది కాకపోవడం, వేళకు ఆహారం ఇవ్వక పోవడం వంటివి చిన్నారుల పెరుగుదలపై ప్రభావం చూపుతు న్నాయి. ఫలితంగా ఆరు నెలల్లోపు పిల్లల్లో 20శాతం, 6-11 నెలల్లోపువారిలో 29 శాతం, 12-17 నెలల్లోపు చిన్నారుల్లో 41 శాతం, 18-24 నెలల్లోపు పసివారిలో 58 శాతం తీవ్ర పోషకాహార లోపంతో సతమతమవుతూ బక్కచిక్కిపోతున్నారు. పదేళ్ల కిందట 52.6శాతం పిల్లలకు అదనపు ఆహారం అందగా, ప్రస్తుతం 42.7శాతం పిల్లలకు మాత్రమే అది అందుబాటులో ఉంది. దేశంలో సుమారు 2.3 కోట్లమంది చిన్నారులకు పౌష్టికాహారం అందుబాటులో లేదని అంచనా!

### దారితప్పిన సంక్షేమం

దళిత, గిరిజన కుటుంబాలకు చెందిన పిల్లల్లో పౌష్టికాహార లోపం మరీ ఎక్కువగా ఉందని 'నిన్' (నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ న్యూట్రిషన్) సంస్థ స్పష్టం చేసింది. 2017 నివేదిక ప్రకారం ఎస్సీల్లో 32.4 శాతం బాలురు, 25.2శాతం బాలికలు పౌష్టికా హార లోపంతో కొట్టుమిట్టాడుతున్నారు. ఈ వర్గాల కోసం ఉప ప్రణాళిక నిధుల కింద తగిన స్థాయిలో ఖర్చు చేయడంలేదు. ఎస్టీల్లో 32.6 శాతం బాలురు, 31.7 శాతం బాలికలు పౌష్టికా హార సమస్యలు ఎదుర్కొంటున్నట్లు 'నిన్' పేర్కొంది. జాతీయ బాలల నివేదిక-2018 ప్రకారం తెలుగు రాష్ట్రాల్లోనూ చిన్నారుల ఆరోగ్య స్థితిగతులు అంతంతమాత్రంగానే ఉన్నట్లు వెల్లడైంది. ఎదుగుదల లోపంతో సతమతమవుతున్న చిన్నారులు ఆంధ్ర ప్రదేశ్‌లోని గ్రామీణ ప్రాంతాల్లో 32.5 శాతం, పట్టణ ప్రాంతాల్లో 28.3 శాతంబీ తెలంగాణ గ్రామాల్లో 33.3 శాతం, పట్టణ ప్రాంతాల్లో 20.9 శాతం ఉన్నట్లు ఆ నివేదిక వెల్లడించింది. పేదరిక నిర్మూలనే లక్ష్యంగా పనిచేసి, ప్రభుత్వాలు ప్రతి ఒక్కరికీ సబ్సిడీ ఆహార పదార్థాలు అందజేయగలిగిన నాడు ఈ పరిస్థితిలో మార్పు వస్తుంది. కొన్ని రాష్ట్రాల్లో ఇప్పటికీ ఆహార కమిషన్లు ఏర్పాటు కాలేదు. తక్షణం వాటిపై దృష్టి పెట్టాలి. కోట్ల సంఖ్యలో ఉన్న నిరుపేద కుటుంబాలకు విస్తృత ఉపాధి అవకాశాలను చేరువ చేయాలి. తద్వారా ఆహార భద్రతకు బాటలు పరవాలి. చిన్నారులకు పౌష్టికాహారం అందించే సమీకృత శిశు సంక్షేమ కేంద్రాలు చాలాచోట్ల అవినీతి నిలయాలుగా మారిపోవడంవల్ల- సంక్షేమ ఫలాలు అందరికీ చేరడం లేదు. నిర్దిష్ట కార్యాచరణతో ప్రభుత్వం ఈ లోపాలను సరిదిద్దాలి. దారిద్ర్యంపై యుద్ధం ప్రకటించి, పసి ప్రాణాలను కాపాడాలి.

# సీడీపీఓపై చర్యలు తీసుకోవాలి

## వేధింపులవల్లే అంగన్‌వాడీ కార్యకర్త మృతి

## తహసీల్దార్‌కు విన్నవించిన సీఐటీయూ నాయకులు

చాలీచాలని వేతనం, అధిక పనిభారంతో విధులు నిర్వర్తి స్తున్న అంగన్‌వాడీ కార్యకర్తలపై వేధింపులకు పాల్పడుతున్న అనంతపురం జిల్లా రాయదుర్గం ఐసీడీఎస్ సీడీపీఓ రాధికను వెంటనే సస్పెండ్ చేయాలని సీఐటీయు జిల్లా ఉపాధ్యక్షుడు మల్లికార్జున డిమాండ్ చేశారు. ఈమేరకు అంగన్‌వాడీ కార్యకర్త లతో కలిసి ఇటీవల తహసీల్దార్ నాగరాజుకు వినతిపత్రం అంద జేశారు. అనంతరం ఆయన విలేకర్లతో మాట్లాడుతూ రాయ దుర్గం మండలం గ్రామదట్ల ఎస్సీ కాలనీలో విధులు నిర్వర్తిస్తున్న అంగన్‌వాడీ కార్యకర్త హరిజన తిప్పక్క సీడీపీఓ, సూపర్‌వైజర్‌ల వేధింపులు తాళలేక టెన్షన్‌కు గురై ఆసుపత్రిపాలై మృతి చెందిం దని ఆరోపించారు. కేంద్రాల తనిఖీలకు వెళ్లినప్పుడు రికార్డుల్లో ఏవైనా చిన్న పొరపాట్లు ఉన్నా సరే కార్యకర్తలు భయభ్రాంతులకు గురయ్యేలా సీడీపీఓ ఆగ్రహం వ్యక్తం చేయడం ఎంతవరకు సమంజసమన్నారు. అనారోగ్యంతో బాధపడుతున్న వారి పట్ల కనీస మానవతాదృక్పథంతో వ్యవహరించకపోతే ఎలా అని నిలదీశారు. కార్యకర్త మృతికి కారకులైన వారిపై చర్యలు తీసుకోవాలని డిమాండ్ చేశారు. కార్యక్రమంలో మృతి చెందిన అంగన్‌వాడీ కార్యకర్త తిప్పక్క సోదరుడు హరిజన మల్లికార్జున, అంగన్‌వాడీ వర్కర్స్ అండ్ హెల్పర్స్ యూనియన్ అధ్యక్షురాలు నరసమ్మ, కార్యకర్తలు మంజుల, మేరీ, భాగ్యమ్మ, హేమావతి, రాధిక, వి. రాధ, హేమావతి, కె. రాధ, హేమలత, వనజ, అనసూయ తదితరులు పాల్గొన్నారు.



# ధర తక్కువ పోషణ ఎక్కువ

## ఆరోగ్యం వెరీ 'గుడ్డు' విజయవాడలో వరల్డ్ ఎగ్ డే వేడుకలు





గుడ్డులో పోషక విలువలు గురించి తెలుసుకుంటే ఔరా అనకుండా ఉండలేం. సామాన్యుడికి సైతం కారు చౌకగా లభించే సంపూర్ణ పౌష్టికాహారం. ఇందులోని మాంసకృతులు, ఖనిజ లవణాలు మనిషి ఆరోగ్యాన్ని పరిరక్షిస్తుంది. నిత్యం ఉడికిన గుడ్డు తింటే శరీరానికి రావలసిన శక్తి అందడమే కాక ఆకలిని కూడా నియంత్రణలో ఉంచుతుంది. బరువును నియంత్రిస్తుంది. గుడ్డులో 13 విటమిన్లుతోపాటు శరీరానికి అవసరమయ్యే కీలక మైన ఆమ్లాలు ఉన్నాయి. ఒక్క సి విటమిన్ తప్ప అన్ని రకాలైన పోషక విలువలు కలిగిన సంపూర్ణ ఆహారంగా గుడ్డును పరిగణి స్తారు. గుడ్డులో 70 క్యాలరీల పోషకాలు ఉంటాయి. తల్లిపాల తర్వాత అంతట సంపూర్ణమైన ఆహారం గుడ్డు మాత్రమేనని చెపుతారు. ఇలాంటి గుడ్డు ప్రాముఖ్యతను తెలియచేసేందుకు ప్రతిఏటా అక్టోబరు 11ను ప్రపంచ గుడ్డు దినోత్సవంగా పిలు స్తారు. వరల్డ్ ఎగ్‌డే వేడుకలను కృష్ణా జిల్లా విజయవాడ అర్బన్ ప్రాంతంలో న్యూరాజరాజేశ్వరి పేటలో సిడిపిఒ మనోరంజని ఆధ్వర్యంలో ఘనంగా నిర్వహించారు. కార్యక్రమానికి ముఖ్య అతిథులుగా హాజరైన విజయవాడ తూర్పు శాసనసభ్యులు గద్దె రామ్మోహన్, పెనమలూరు ఎంఎల్ఎ బోడే ప్రసాద్‌లు పాల్గొని విద్యార్థుల ఆరోగ్యాన్ని కాపాడాలనే లక్ష్యంతో అంగన్‌వాడీ కేంద్రా లతో పాటు ప్రభుత్వ పాఠశాలల్లో మధ్యాహ్న భోజనంలో వారానికి 5 గుడ్లు సరఫరా చేస్తున్నామన్నారు. అదే అంగ్‌వాడీ కేంద్రాల్లో అయితే మూడేళ్లలోపు చిన్నారులకు వారానికి రెండు ఆరేళ్ళలోపు ప్రీస్కూల్ పిల్లలకు వారానికి నాలుగు, గర్భిణీ బాలింతలకు వారానికి ఐదు గుడ్లు వంతున నెలకు 25 గుడ్లును సరఫరా చేస్తున్నామన్నారు. విద్యార్థుల ఆరోగ్యానికి గుడ్లు ఎంతగానో దోహదపడుతున్నాయన్నారు. అనంతరం నెక్ ఛైర్మన్ కుటుంబ రావు మాట్లాడుతూ నిలకడలేని ధరలతో గుడ్డు ధర పతనం అవుతుందని పేద కుటుంబాల్లో కీలకపాత్ర పోషిస్తున్న గుడ్డు రైతులకు మార్కెటింగ్ సదుపాయం లేక దళారులు ఇష్టారాజ్యంగా ధరలను నిర్ణయించి సరఫరా చేస్తున్నారన్నారు. గుడ్డును ఏడు నిమిషాలపాటు ఉడికించి తింటే అన్ని పోషకవిలువలు అందుతా యన్నారు. పచ్చిగుడ్డును తినడం మంచిది కాదన్నారు. ఉడికించిన తర్వాత కూరల్లో వేయడం, ఆమ్లేట్‌గా తినడం వల్ల ప్రయోజనం శూన్యమన్నారు. గుడ్డులో కండరాల కణజాలానికి మేలుచేసే ఎమినో ఆమ్లాలు ఎక్కువగా ఉంటాయన్నారు. ప్రాజెక్టు డైరెక్టర్ కృష్ణకుమారి మాట్లాడుతూ కోడిగుడ్డులో ఉండే కోలీన్ అనే పోషక పదార్థం మెదడు అభివృద్ధికి దోహదం చేస్తుందని చెప్పారు. అంగన్‌వాడీ కేంద్రాలకు సరఫరా చేసే గుడ్లులో సైజు చిన్నగా ఉన్నా, పాడైపోయిన గుడ్లను తీసుకోకూడదన్నారు. నిల్వ ఉండ కుండా చూసుకోవాలని పేర్కొన్నారు. గుడ్డు సంపూర్ణ ఆరోగ్యం కనుక గర్భిణీలు, బాలింతలు గుడ్డు తినటంలో అశ్రద్ధ చేయ కూడదన్నారు. కార్యక్రమాల్లో గన్నవరం ఎసిడిపిఒ మెహర్ లలిత, కంకిపాడు పిఒ ఉమాదేవి, విజయవాడ అర్బన్ 2 సెక్టార్ పిఒ సువర్ణ, పర్యవేక్షకులు, అంగన్‌వాడీ కార్యకర్తలు పాల్గొన్నారు. అంగన్‌వాడీ చిన్నారులు వరల్డ్ ఎగ్‌డే అంటూ ప్రదర్శించిన ప్లకార్డు అందరినీ ఆకట్టుకున్నాయి.

# వైద్య మరియు ఆరోగ్య శాఖ ద్వారా అందుతున్న సేవలు

డి. మేఘన ఉదయ్

## 1. మాతా శిశు ఆరోగ్య సేవలు (M.C.H.)



ఈ సేవల క్రింద గర్భిణీ స్త్రీలకు (1) నమోదు (2) ఆరోగ్య పరీక్షలు నిర్వహించుట (3) టి.టి. సూది మందు (4) రక్తహీనత నివారణకు ఐరన్ మాత్రలు (5) ప్రమాదకర గర్భిణీ స్త్రీలను గుర్తించి వారికి ప్రత్యేక వైద్య సదుపాయములు కల్పించుట (6) ముందస్తుగా ప్రసవ స్థలం గుర్తించి సుఖప్రసవం అయ్యేలా చూచుట మొదలగు సేవలు అందించి గర్భిణీ స్త్రీ ఆరోగ్యమును పెంపొందించి మాతా శిశు మరణములు తగ్గించుటకు కృషి జరుగుచున్నది.

## 2. ప్రధానమంత్రి సురక్షిత మాతృత్వ అభియాన్ (P.M.S.M.A.)



ఈ కార్యక్రమమును నూతనముగా మాతా శిశు ఆరోగ్యమును పెంపొందించుటకు ప్రారంభించుట జరిగినది. ఈ కార్యక్రమము క్రింద ప్రతీనెలా 9వ తేదీన నాల్గవ నెల నిండిన గర్భిణీ నుండి తొమ్మిదవ నెల వరకు గల గర్భిణీ స్త్రీలను స్త్రీ వైద్య నిపుణులు (గైనకాలజిస్ట్)చే ఉచితముగా గుర్తించిన ఆసుపత్రులలో వైద్య పరీక్షలు చేయించి, వైద్య సదుపాయము / సలహాలు అందించి తల్లి ఆరోగ్యం మెరుగుపరచుటకు కృషి చేయుట జరుగుచున్నది. శిశు ఆరోగ్యం మెరుగుపరచుటలో భాగంగా జిల్లాలో గల ఒక S.N.S.U. సెంటర్ల ద్వారానూ, 8 N.B.S.U.ల ద్వారానూ ప్రత్యేక వైద్య సదుపాయములు అందించుట జరుగుచున్నది. అనారోగ్య శిశువులకు మరియు ప్రత్యేక వైద్య చికిత్స అవసరం అయిన వారికి వైద్య సదుపాయములు అందించుటకుగాను N.R.C. సెంటర్లను ఏర్పాటు చేసి ప్రత్యేక సేవలు అందించి శిశు మరణాలు తగ్గే విధముగా కృషి చేయుట జరుగుచున్నది.

## 3. సార్వత్రిక వ్యాధి నిరోధక టీకాల కార్యక్రమం (U.I.P)



ఈ కార్యక్రమంలో క్షయ (బిసిజి), పోలియో (ఒపివి/ఐపివి), రోటా వైరస్ (ఆర్‌వి), పెంటావేలెంట్ కంటసర్పి, ధనుర్వాతం, కోరింతదగ్గు / పర్టుసిస్, పచ్చకామెర్లు, న్యుమోనియా, పొంగు (మీజిల్స్), మెదడువాపు (జెఇ-ఏజెన్సీ ప్రాంతాలైన కుక్కునూరు, అమరవరం, కొయిద, వేలేరుపాడు, పిహెచ్‌సి పరిధిలో మాత్రమే) ఇచ్చి 10 ప్రాణాంతక వ్యాధులు నుండి శిశువుకు రక్షణ కల్పించుట జరుగుచున్నది. అంతేగాక గర్భిణీ స్త్రీలకు టి.టి. రెండు మోతాదులు ఇచ్చి బిడ్డకు ధనుర్వాతము నుండి రక్షణ కల్పించుట జరుగుచున్నది.

## 4. ప్రభుత్వ వైద్యరంగంలో ఐదు సరికొత్త సేవలు




**(Five Initiative Services) :** రాష్ట్ర ప్రభుత్వము ప్రజలకు మెరుగైన వైద్య సేవలు అందించాలనే లక్ష్యముతో ది. 01-01-2016వ తేదీన 5 సేవలను రాష్ట్రములో అందుబాటులోకి తెచ్చినది. అవి

**1. ఎన్‌టిఆర్ వైద్య పరీక్షలు – లేబొరేటరీ సర్వీసెస్:** ఈ సేవల్లో భాగంగా ప్రజలకు ఉచిత ల్యాబ్ పరీక్షలు, అన్ని పిహెచ్‌సిలలో-19 (12 ఇన్‌హౌస్ + 7 అవుట్‌హౌస్), సిహెచ్‌సిలలో-40 (15 ఇన్ హౌస్ + 26 అవుట్ హౌస్) ఎహెచ్/డిహెచ్‌లలో-63 (17 ఇన్‌హౌస్ + 46 అవుట్‌హౌస్) పరీక్షలు చేయుట జరుగుచున్నది.

**2. ఎన్‌టిఆర్ వైద్య పరీక్షలు టెలీ రేడియాలజీ సర్వీసులు:** ఈ సర్వీసుల్లో భాగంగా గుర్తించిన డిహెచ్/ఎహెచ్/సిహెచ్‌సిలలో ఎక్స్‌రే సదుపాయములు మరియు స్కానింగ్ సదుపాయము ఉచితంగా అందించుట జరుగుచున్నది.

**3. బయోమెడికల్ ఎక్విప్‌మెంట్ ఇంజనీరింగ్ సర్వీసెస్(Telematic Bio Medical Services):** ఈ సేవల్లో భాగంగా ఆసుపత్రులలోగల అన్ని పరికరములు ట్యాగ్‌చేసి వినియోగములోనికి తీసుకుని వచ్చుట మరియు పరికరముల నిర్వహణ, మరమ్మత్తులు మొదలగునవి ఎప్పటికప్పుడు పర్యవేక్షిస్తూ వైద్య సేవలకు అంతరాయం కలగకుండా చేయుట జరుగుచున్నది.

**4. 102 కాల్ సెంటర్ :** ఈ సేవల్లో భాగంగా ఉచిత వైద్య సలహాలు, సేవలు ఎల్లవేళలా 102 కాల్ సెంటర్ ద్వారా అందించుట జరుగుచున్నది. ప్రజలు 102 టోల్‌ఫ్రీ నెంబరు ద్వారా పై సేవలను పొందవచ్చును.



**5. తల్లి బిడ్డ ఎక్స్‌ప్రెస్ :** ఈ సేవల్లో భాగంగా ప్రభుత్వ ఆసుపత్రులలో ప్రసవించిన తల్లిని బిడ్డని మరియు ఒక సహాయకున్ని సురక్షితముగా ప్రభుత్వ ఆసుపత్రుల నుండి ఇంటికి ఉచితముగా చేరవేయుట జరుగుచున్నది.

## 5. మహిళా మాస్టర్ హెల్త్ చెకప్ 35 + (M.M.H.C)

**లబ్ధిదారులు : 35 సంవత్సరములు నిండిన మహిళలు**



వీరికి ప్రత్యేక పరీక్షలు నిర్వహించి వీరి ఆరోగ్యమును కాపాడుటకు చర్యలు తీసుకొనుట జరుగుచున్నది. ఇందులో 14 రకముల పరీక్షలు నిర్వహించుట జరుగును. మహిళలను ఆరోగ్య కార్యకర్త స్థానికంగా పరీక్షించి అనుమానిత మహిళలను ప్రతీ 2వ, 4వ గురువారము జిల్లాలో గుర్తించిన ఆసుపత్రులు 1)జిల్లా ప్రధాన ఆసుపత్రి, ఏలూరు 2) ఏరియా ఆసుపత్రి, తణుకు 3) ఏరియా ఆసుపత్రి, జంగారెడ్డిగూడెం 4) సామాజిక ఆరోగ్య కేంద్రం, భీమవరంలకు ఆ గుర్తించిన కేసులను వైద్య పరీక్షల నిమిత్తం ఆరోగ్య కార్యకర్త తీసుకొని వెళ్ళి వైద్య సేవలు అందించేలా ఏర్పాటు చేయుట జరిగినది. పైన పేర్కొన్న ఆసుపత్రులలో 14 రకముల పరీక్షలు నిర్వహించి, వ్యాధి నిర్ధారణ చేసి అవసరం మేరకు చికిత్స అందించెదరు.

## 6. రాష్ట్రీయ బాల స్వస్థ్య కార్యక్రమము (R.B.S.K.)

**లబ్ధిదారులు : 18 సంవత్సరముల లోపు గల బాలబాలికలు**

ఈ కార్యక్రమంలో భాగంగా 18 సంవత్సరముల లోపు గల బాలబాలికలకు ప్రతీ సంవత్సరం రెండుసార్లు ఆరోగ్య పరీక్షలు నిర్వహించుటతో పాటుగా బాలబాలికలకు అవసరం మేరకు మెరుగైన చికిత్స కొరకు ఏలూరులో ఏర్పాటు చేసిన డిఇపిసికు పంపి అక్కడ మెరుగైన వైద్య సదుపాయములు అందించుట జరుగుచున్నది.

## 7. రాష్ట్రీయ కిశోర స్వస్థ్య కార్యక్రమము (R.K.S.K.)

**లబ్ధిదారులు : 10 నుండి 19 సంవత్సరములలోపు గల యుక్త వయస్కులు**




ఈ కార్యక్రమము క్రింద జిల్లాలో 34 యువ క్లినిక్‌లను ఏర్పాటు చేసి 10 నుండి 19 సంవత్సరముల యుక్త వయస్కులకు ఈ క్రింది సేవలు అందించుట జరుగుచున్నది. అవి కౌన్సిలింగ్, లైంగిక మరియు పునరుత్పత్తి ఆరోగ్యంపై అవగాహన, మానసిక ఆరోగ్యము మరియు మత్తు పదార్ధముల వలన వచ్చు అనర్ధములపై అవగాహన కల్పించుట జరుగుచున్నది. అంతేగాక రక్త హీనత నివారణకు ఐరన్ మాత్రలు, నులిపురుగు నివారణకు ఆల్బెం డజోల్ మాత్రలు ఇచ్చెదరు.

## 8. జననీ సురక్షా యోజన (J.S.Y.)

**లబ్ధిదారులు : ప్రభుత్వ ఆసుపత్రిలో ప్రసవించిన గర్భిణీ స్త్రీలు**

ఈ కార్యక్రమము క్రింద గర్భిణీ స్త్రీలకు ప్రభుత్వ ఆసుపత్రుల్లో ప్రసవం అయినచో ప్రోత్సాహకముగా గ్రామీణ ప్రాంత నివాస గర్భిణీ స్త్రీ అయినచో రూ. 1,000/-లు, పట్టణ ప్రాంతం అయినచో రూ.600/-లు పారితోషికం డి.బి.టి. ద్వారా అందించుట జరుగుచున్నది.

## 9. జననీ శిశు సురక్షా కార్యక్రమం (J.S.S.K.)

**లబ్ధిదారులు : ప్రభుత్వ ఆసుపత్రిలో ప్రసవించిన గర్భిణీ స్త్రీలు**



ఈ కార్యక్రమంలో భాగంగా ఆసుపత్రిలో ప్రసవించిన గర్భిణీ స్త్రీలకు ఉచిత ప్రసవముతోపాటుగా ఉచిత ఆహారము సాధారణ ప్రసవములో 3 రోజులు, సిజేరియన్ ప్రసవములో 7 రోజులు, ఉచితముగా రవాణా సదుపాయము, పరీక్షలు, వైద్యం, మందులు, రక్తమార్పిడి వంటి సహాయము అందించుట జరుగుచున్నది. ఈ కార్యక్రమం యొక్క ముఖ్య ఉద్దేశ్యము ఆసుపత్రులలో ప్రసవము ప్రోత్సహించుటతో పాటుగా తల్లిబిడ్డ మరణములు తగ్గించి సుఖప్రసవము అయ్యే విధంగా చూచుట.

## 10. కుటుంబ సంక్షేమ కార్యక్రమం (F.W.P.)



ఈ కార్యక్రమంలో భాగంగా అర్హులైన దంపతులకు కుటుంబ నియంత్రణ శస్త్ర చికిత్సలు చేయించుట జరుగుచున్నది. మగవారికి వాసెక్టమీ, ఆడవారికి ట్యూబెక్టమీ ప్రతీ ప్రాథమిక ఆరోగ్య కేంద్రం మరియు సిహెచ్‌సిలలో చేయుట జరుగుచున్నది. వీరికి పారితోషికముగా వాసెక్టమీకి రూ. 1,100/-లు, ట్యూబెక్టమీకి రూ. 600/-లు ప్రభుత్వము నుండి అందించుట జరుగుచున్నది.

## 11. జనన మరణ ధృవపత్రములు అందించుట



ఆసుపత్రులలో సంభవించిన జనన, మరణములకు సంబంధించిన ధృవీ కరణ పత్రములు నేరుగా సంబంధిత ప్రభుత్వ వైద్యులు జారీ చేసే



విధముగా చర్యలు తీసుకొనుట జరిగినది. దీని వలన లబ్ధిదారులకు సమయము మరియు వ్యయప్రయాసలు తగ్గే విధముగా చర్యలు తీసుకోవడం జరిగినది.

## 12. నేషనల్ హెల్త్ మిషన్ (N.H.M.)




జాతీయ ఆరోగ్య మిషన్‌లో భాగంగా సబ్‌సెంటర్, పిహెచ్‌సి, సిహెచ్‌సి, ఎహెచ్, డిహెచ్‌లకు ప్రతీ సంవత్సరము హెచ్.డి.ఎస్. ఫండ్ విడుదల చేయుట జరుగుచున్నది. వారి వారి అవసరాల మేరకు ప్రజల ఆరోగ్య పరిస్థితిని మెరుగుపరిచే విధంగాను రోగులకు మెరుగైన చికిత్స అందించే విధముగాను ప్రణాళికలు తయారుచేసుకుని మార్గదర్శకములకు లోబడి వారి వారి కమిటీల ఆమోదము పొందిన తదుపరి నిధులు వినియోగించు కొనుట జరుగుచున్నది. నిధుల మంజూరు సబ్‌సెంటర్‌కి ప్రభుత్వ భవనమైతే రూ. 20 వేలు, అద్దె భవనమైతే రూ. 10 వేలు చొప్పున అన్‌టైడ్ ఫండ్ మరియు శానిటేషన్ ఫండ్ ప్రతీ గ్రామ పంచాయితీకి రూ.10 వేలు, పిహెచ్‌సికి రూ. 1.75 లక్షలు, సిహెచ్‌సికి రూ. 5 లక్షలు, ఎహెచ్‌కి రూ. 10 లక్షలు, ఒక సంవత్సరానికి తక్కువ కాకుండా మంజూరు చేయుట జరుగుచున్నది.

## 13. గర్భస్థ లింగ నిర్ధారణ చట్టం (P.C & P.N.D.T.)



ఈ చట్టం క్రింద జిల్లాలో 201 స్కానింగ్ సెంటర్లు రిజిస్టర్ చేయుట జరిగినది. అందులో ప్రస్తుతము 153 పనిచేయుచున్నవి. ఇందులో ప్రభుత్వ ఆసుపత్రులలో 22, ప్రైవేటు ఆసుపత్రులలో 131 పనిచేయుచున్నవి. ఈ చట్టము దుర్వినియోగము కాకుండా జిల్లాస్థాయి, డివిజన్‌లస్థాయి ఆథారిటీటీలు మరియు కమిటీలు ఏర్పాటు చేయడం జరిగినది మరియు ప్రతీనెలా "డెకాయి ఆపరేషన్లు" నిర్వహించి చట్ట వ్యతిరేకులను గుర్తించుటకు చర్యలు చేపట్టుట జరుగుచున్నది. పేద గర్భిణీ స్త్రీలకు రూ. 200/-లకే స్కానింగ్ పరీక్ష చేసే విధంగా 15 స్కానింగ్ సెంటర్ల వద్ద ఎం.ఓ.యు. తీసుకుని జె.ఎస్.ఎస్.కె. స్కీము ద్వారా ప్రజలకు తక్కువ రేటుకే ఈ సదుపాయం అందేలా చర్యలు తీసుకొనుట జరిగినది.

## 14. ఎయిడ్స్ నియంత్రణా కార్యక్రమము

జిల్లాలో ఎయిడ్స్ వ్యాధి నివారణలో భాగంగా ఇంతవరకు 13,050 పెద్దలు, 477 పిల్లలను హెచ్.ఐ.వి. పాజిటివ్‌లుగా గుర్తించి వారికి చికిత్స మరియు సేవలు అందించుట జరుగుచున్నది. రక్తనిధి కేంద్రాలు 3 ఏర్పాటు చేసి అవసరమైన రోగులకు పరీక్షించిన రక్తము అందించుట జరుగుచున్నది. గర్భిణీ స్త్రీలకు గర్భనిర్ధారణ జరిగిన వెంటనే హెచ్.ఐ.వి. పరీక్ష నిర్వహించి ఒకవేళ హెచ్.ఐ.వి. పాజిటివ్ అయినట్లయితే ఎ.ఆర్.టి. చికిత్స ఇస్తూ సుఖప్రసవం జరిగే విధంగానూ మరియు పుట్టిన బిడ్డను హెచ్.ఐ.వి. బారి నుండి రక్షించే విధముగాను అన్ని చర్యలు తీసుకోవడం జరుగుచున్నది.



## 15. జాతీయ కుష్ఠు నివారణ కార్యక్రమం (N.L.E.P.)



ఈ కార్యక్రమంలో భాగంగా అనుమానాస్పద లక్షణములు గల వారిని గుర్తించి పరీక్షించి వ్యాధి నిర్ధారణ చేసి వారికి ఎం.డి.టి. చికిత్స పూర్తి కాలము అందించుట జరుగుచున్నది. ఇదే కార్యక్రమములో గతంలో గుర్తించి చికిత్స పూర్తి అయి అంగవైకల్యము గల వారికి (పాదాలు) ఎంసిఆర్ చెప్పులు ప్రతీ 6 నెలలకు ఒకసారి అందించుట జరుగుచున్నది. జిల్లాలో 13 లెప్రసీ కాలనీలను గుర్తించి వానిలో నివాసం ఉంటున్న వారికి వారి వారి అవసరాల మేరకు మందులు, వైద్య సలహాలు ఎప్పటికప్పుడు అందించుట జరుగుచున్నది.

## 16. జాతీయ కీటక నియంత్రణా కార్యక్రమం




ఈ కార్యక్రమంలో భాగంగా జ్వరముతో బాధపడుతున్న వారికి మరియు జ్వరము వచ్చి తగ్గిన వారిని ఇంటింటి సర్వేలో గుర్తించి రక్తపూత తీసి మలేరియా వ్యాధి నిర్ధారణ పరీక్షలు చేయుట జరుగుచున్నది. అంతేగాక పిహెచ్‌సి/సిహెచ్‌సి/ఎహెచ్/డిహెచ్‌లకు వచ్చిన జ్వరం కేసులకు కూడా రక్తపూతలు తీసి మలేరియా కొరకు పరీక్షలు నిర్వహించుట జరుగుచున్నది. మలేరియా వ్యాధినిర్ధారణ అయితే రోగికి పూర్తి చికిత్స అందించుటయే గాక కుటుంబ సభ్యులకు మరియు చుట్టుప్రక్కల గల సుమారు 50 ఇళ్ళ వరకు సర్వే నిర్వహించి మాస్‌గా రక్తపూతలు తీసి మలేరియా పరీక్షలు నిర్వహించుట జరుగుచున్నది.

మలేరియా నిర్ధారణ జరిగిన మైదాన ప్రాంతములలో ఇండోర్ రెసిడ్యువల్ స్ప్రే మలాథియాన్‌తో చేయుట జరుగుచున్నది. అవసర్ మేరకు పంచాయితీ/మునిసిపాలిటీ వారి సహకా



రంతో ఫ్రాగింగ్, స్ప్రేయింగ్ (పైరిథం స్ప్రే, ఎబేట్ బైటెక్స్) వంటివి చేసి దోమల నివారణ చేయుట జరుగుచున్నది. మత్స్య శాఖ వారి సహకారంతో గాంబూషియా చేపలను నీరు నిలువ ఉన్నచోట వదిలి దోమ లార్వాను నాశనం చేయుట జరుగుచున్నది. గిరిజన ప్రాంతములలో ప్రతి సంవత్సరం సీజన్‌కు ముందుగానే ఇండోర్ రెసిడ్యువల్ స్ప్రే మలాథియాన్‌తో మొదటి పర్యాయము చేయుట మరియు ఆగస్టు మొదటిలో రెండవ పర్యాయము మొత్తం అన్ని గ్రామములలో చేయుట జరుగుచున్నది. రాపిడ్ రెస్పాన్స్ టీమ్ ఏర్పాటు చేసి సత్వరం రోగులకు మలేరియా చికిత్స అందేలా చర్యలు తీసుకొనుట జరుగుచున్నది. జిల్లాలో ఇంటిగ్రేటెడ్ డిసీజ్ సర్వేలెన్స్ ప్రాజెక్టు (ఐ.డి.ఎస్.పి)లో భాగంగా ప్రతీరోజు నిఘా (సర్వేలెన్స్) ద్వారా నివేదిక సేకరించి చర్యలు తీసుకొనుట జరుగుచున్నది. అంటువ్యాధులు ప్రబలే అవకాశం వున్న గ్రామాలను ముందుగానే గుర్తించి విశ్లేషించి అవి రాకుండా లేదా మరింత ప్రబలకుండా చర్యలు తీసుకొనుట మరియు కారణములు అన్వేషించి తగిన చర్యలకు సిఫారసులు చేయుట జరుగుచున్నది.

### 17. సవరించిన జాతీయ క్షయవ్యాది నివారణ కార్యక్రమము (R.N.T.C.P)




జిల్లాలో క్షయవ్యాధి నివారణ కార్యక్రమంలో భాగంగా రెండు వారావలు మించి దగ్గు, జ్వరము, నీరసించి పోవుట, బరువు తగ్గుట, కఫంలో కూడిన ఉమ్మి వంటి లక్షణములు కలవారిని గుర్తించి జిల్లాలో గల 18 టి.యు.లు మరియు 52 డి.ఎం.సిల ద్వారా కళ్ళెపరీక్ష మరియు ఎక్స్‌రేల ద్వారా వ్యాధి నిర్ధారణ చేయుట జరుగుచున్నది. ఇందులో వ్యాధి నిర్ధారణ చేసిన తదుపరి రోగి లక్షణములను బట్టి కేటగిరి – 1,2ల మందులు ఆయా కేసులకు అందించి పూర్తికాలం చికిత్స, ఆరోగ్య వైద్య చేయుట జరుగుచున్నది. ఒకవేళ పూర్తికాలం చికిత్స తీసుకున్న తదుపరి కూడా పాజిటివ్‌గానే రోగి మిగిలి ఉన్నట్లయితే వారికి ప్రత్యేక చికిత్స సిబిఎన్ఎటి మిషన్ ద్వారా నిర్ధారించి ఎండిఆర్ చికిత్స అందించుట జరుగుచున్నది.

# వసతులు లేని గృహాలు

ఇటీవల వివిధ వసతిగృహాల్లోని చిన్నారులపై లైంగికదాడులు ఎక్కువయ్యాయి. ఈ నేపథ్యంలో వసతిగృహాల పనితీరు, వాటిలోని సదుపాయాలను పరిశీలిద్దాం. దేశంలోని వివిధ వసతి గృహాల్లో నివసిస్తున్న చిన్నారుల సంఖ్యపై ఇంతవరకు స్పష్టత లేదు. ఎందుకంటే 'చైల్డ్ లైన్ ఫౌండేషన్ (సిఐఎఫ్)' 2017 గణాంకాల ప్రకారం వసతిగృహాల్లో రక్షణపొందే చిన్నారుల సంఖ్య 4.7 లక్షలు, డబ్ల్యుసిడి మంత్రిత్వశాఖ 2018లో సుప్రీం కోర్టుకు నివేదించిన గణాంకాల ప్రకారం వారి సంఖ్య 2.61 లక్షలుగా వుంది. అంతేకాదు, దేశంలోని మొత్తం శిశుసంరక్షణ గృహాల్లో 33 శాతం రిజిష్టర్ కానివే వున్నాయని తెలిపింది.

మొదటిసారి గుర్తింపు పొందిన వసతి గృహాలు : 9,589

మహిళా సూపరింటెండెంట్ గాని, మేనేజరు గాని లేని బాలికా సంరక్షణ గృహాలు : 2,309

వివిధ రాష్ట్రాల్లో బాలికా వసతి గృహాల్లో ఖాళీగా వున్న పోస్టుల సంఖ్య : 4,000

విద్యాభ్యాసానికి తగిన సదుపాయాలు కల్పించని వసతి గృహాల సంఖ్య : 2,624

పిల్లలకు కావాల్సిన పోషకాహారం అందించనివి : 2,098



చిన్నారులకు అందించాల్సిన ఆహారంపై ఎటువంటి ప్రమాణాలు పాటించనవి : 3,091

పుట్టిన రోజులు జరపనివి : 2,604

పండుగలప్పుడు, వివిధ ప్రత్యేక సందర్భాలలో ప్రత్యేక వంటకాలు అందించనివి : 624

బలహీనంగా వున్న చిన్నారుల పట్ల ప్రత్యేక శ్రద్ధ చూపనివి : 830

పరిశుభ్రమైన, కాలానుగుణంగా ధరించే వస్త్రాలను అందించని వసతి గృహాలు : 1,154

విశ్రాంతి తీసుకునేందుకు కావాల్సిన, పరిశుభ్రమైన, వ్యక్తిగతమైన పరుపులు అందించనివి : 1,164

ప్రతిరోజూ విశ్రాంతి సామాగ్రిని, మరుగుదొడ్లను శుభ్రపరచనివి : 954

వసతి గృహాల క్యాంపస్ పరిసరాలను పరిశుభ్రపరచనివి : 845

ధారాళంగా గాలి, వెలుతురు లభించనివి : 1,310

# పశ్చిమగోదావరిలో అంగన్‌వాడీలు ధర్నా

## పని ఒత్తిడితో మరణించిన కార్యకర్త కుటుంబాన్ని ఆదుకోవాలని డిమాండ్



పశ్చిమగోదావరి జిల్లాలో అంగన్‌వాడ కార్యకర్తలు జిల్లా కేంద్రమైన ఏలూరు కలెక్టరేట్ కార్యాలయం వద్ద ఇటీవల ధర్నా నిర్వహించారు. పనిభారాన్ని తగ్గించాలనే ప్రధాన డిమాండ్‌తో ఈ ఆందోళన చేసారు. ఇదే జిల్లాలో పెదపాడు ప్రాజెక్టు పరిధి లోని ఒక కార్యకర్త ఉమ్మడి ఝాన్సీరాణి తీవ్ర పని ఒత్తిడి కారణంగా గుండెపోటు వచ్చి మరణించటంతో ఆమె కుటుంబానికి న్యాయం చేయాలని కోరుతూ నినాదాలు చేసారు. ఇటీవల కాలంలో అంగన్‌వాడీలపై పనిభారం పెరిగి అసలు విధులు కంటే అదనపు విధులు చేయలేక మానసిక ఒత్తిళ్ళకు గురికావటమేకాక అనారోగ్యం పాలవుతున్నారు. కొందరు అయితే అశువులు బాసుతున్నారు. సర్కారు ప్రవేశపెడుతున్న పలు సంక్షేమ పథకాల అమలులో గ్రామీణ ప్రాంతాల్లో అంగన్‌వాడీల పాత్ర చాలా కీలకంగా ఉంటాది. ప్రతి ప్రభుత్వ కార్యకలాపాల్లో తమను భాగస్వాములను చేస్తున్నారని ఉదాహరణగా బి.ఎల్.ఒ. డ్యూటీలు మూలంగా మానసికంగా తామంతా ఒత్తిళ్ళకు గురవుతున్నామంటున్నారు. పెదపాడు ప్రాజెక్టు కార్యకర్త ఝాన్సీ కేవలం బి.ఎల్.ఒ విధులు కారణంగానే ఒత్తిడికి గురి అయి గుండె ఆగిపోయిందని పేర్కొన్నారు. కార్యక్రమానికి ముఖ్య అతిథిగా హాజరైన రాష్ట్ర నాయకురాలు సుబ్బరావమ్మ ధర్నాని ఉద్దేశించి మాట్లాడుతూ అంగన్‌వాడీ కార్యకర్తగా అసలు విధులు కంటే అదనపు విధులు ఎక్కువగా చేస్తున్నామని జాబ్ చార్ట్‌లో లేని పనులు కూడా తమతో చేయించుకుంటున్నారని, ఇంత పని చేసినా ఏళ్ళ తరబడి స్కీమ్ వర్కర్లుగానే గుర్తిస్తున్నారు తప్ప ఐసిడిఎస్ ఉద్యోగులుగా గుర్తించడంలేదన్నారు. జీతాలు పెంచామనే పేరుతో పని భారాన్ని విపరీతంగా పెంచారన్నారు. ఏలూరు అసెంబ్లీ పరిధిలో తొలగించబడిన 30 వేల ఓటర్లను తిరిగి చేర్పించడం కోసం అధికారులు చేసిన ఒత్తిడి కారణంగానే ఝాన్సీ మృతి చెందిందని ఆమె మృతికి అధికారులే బాధ్యత వహించాలని డిమాండ్ చేసారు. చిన్న పిల్లలతో అంగన్‌వాడీ కేంద్రాన్ని నడుపు కుంటూ బూత్‌లెవెల్ ఆఫీసర్‌గా పనిచేయడం ఎలా సాధ్యం అవుతాదో అధికారులే సమాధానం చెప్పాలన్నారు. జిల్లాలో కొంత మంది వర్కర్లు హెల్పర్లకు నెలలు తరబడి జీతాలు రాక ఆర్థిక ఇబ్బందులు పడుతున్నారన్నారు. అదనపు పనులు అప్పగిస్తూ ఒకవైపు విజిలెన్స్ కమిటీల పేరుతో దాడులు చేయడం తుగ్లక్ చర్యగా ఆమె అభివర్ణించారు. అంగన్‌వాడీలకు సరఫరా చేసే ఆహారపదార్థాలు నాణ్యతకొరవడి వెలవెలబోతుంటే గుత్తేదారులపై అధికారులు ఎందుకు చర్యలు చేపట్టడం లేదన్నారు. కేంద్రాలకు నాణ్యమైన సరుకులు సరఫరా చేయకుండా తనిఖీలు చేయించి అంగన్‌వాడీ కార్యకర్తలను బలిపశువులను చేస్తున్నారని ఈ విధానంలో మార్పు రావాలన్నారు.

### కార్యకర్త కుటుంబాన్ని ఆదుకోవాలి

పెదపాడు ప్రాజెక్టులో తీవ్ర మానసిక ఒత్తిడితో మృతి చెందిన కార్యకర్త యు ఝాన్సీ కుటుంబాన్ని ఆదుకోవాలని ఆమె స్థానంలో ఝాన్సీ కుమార్తెకు ఉద్యోగం ఇచ్చి ఆదుకోవాలని అధికారులను డిమాండ్ చేసారు. అనంతరం ఐసిడిఎస్ పిడి విజయకుమారికి సమస్యలతో కూడిన వినతిపత్రాన్ని అందజేసారు. ఇటీవల కాలంలో రాష్ట్రవ్యాప్తంగా చాలామంది కార్యకర్తలు పనిఒత్తిళ్ళతో అకాల మరణం పొందుతున్నారని పనిభారాన్ని తగ్గించాలన్నారు. అక్టోబర్ 27న జాయింట్ మీటింగ్ ఏర్పాటు చేసి సమస్యలు పరిష్కరిస్తానని పిడి హామీ ఇచ్చారు. కార్యక్రమంలో సిఐటియు డెల్టా, అప్‌ల్యాండ్ కమిటీల జిల్లా ప్రధాన కార్యదర్శులు కె రాజారామ్మోహనరాయ్, డిఎన్‌విడి ప్రసాద్, యూనియన్ జిల్లా కార్యదర్శి భారతి, శ్యామలారాణి, విజయలక్ష్మి, అనంతలక్ష్మి తదితరులు పాల్గొన్నారు.

# బాలకార్మిక వ్యవస్థ నిర్మూలనలో భారత్ భేష్

## పకడ్బందీగా చట్టాల అమలు

బాల కార్మిక వ్యవస్థను నిర్మూలించడంలో భారత్ మంచి పురోగతిని సాధించింది. ప్రపంచ దేశాలలో కేవలం 14 దేశాలే బాల కార్మిక వ్యవస్థ నిర్మూలనపై ప్రత్యేకంగా దృష్టి సారించగా, వాటిలో భారత్ ఉండటం విశేషం. అగ్రరాజ్యం అమెరికా కార్మిక శాఖ భారత్‌కు ఈ కితాబునివ్వటం విశేషం. 2017లో ప్రపంచ దేశాలలో బాల కార్మికవ్యవస్థ నిర్మూలనపై 'బాలకార్మికులు, నిర్బంధ కార్మికులు'కు సంబంధించిన వార్షిక నివేదికను అమెరికా కార్మికశాఖ ఇటీవల విడుదల చేసింది. అత్యంత దుర్భరంగా తయారైన బాలకార్మిక వ్యవస్థ నిర్మూలనపై భారత్ చేపట్టిన విధానాలు సత్ఫలితాలు ఇచ్చాయని, ఫలితంగానే ఆ వ్యవస్థ నిర్మూలనలో మొదటి 14 దేశాల జాబితాలో భారత్ ఉన్నట్లు ఆ నివేదిక వెల్లడించింది. ట్రేడ్ అండ్ డెవలప్‌మెంట్ చట్టం 2000 ప్రకారం ప్రపంచ దేశాలలో బాల కార్మిక వ్యవస్థపై అమెరికా కార్మికశాఖ సమగ్ర పరిశోధన నిర్వహించింది. అందుకోసం ప్రపంచంలోని 132 దేశాలలో బాలకార్మిక వ్యవస్థ ఎలావుంది. దీని నిర్మూలనకు ఆయా దేశాలు చేపడుతున్న చర్యలపై ప్రత్యేకంగా అధ్యయనం చేసినట్లు అమెరికా పేర్కొంది. భారత్‌తో పాటు కొలంబియా, పరాగ్వేలో బాల కార్మిక వ్యవస్థ నిర్మూలనకు సరికొత్త విధానాలను అవలంభించినట్లు అధ్యయనంలో వెల్లడైంది. ఈ వ్యవస్థ సమూల నిర్మూలన కోసం ఆయా దేశాలు ప్రత్యేకంగా చట్ట, విధానపరమైన నిర్ణయాలు చేసినట్లు నివేదిక తెలిపింది.

### ఐఎల్ఓకు అనుగుణంగా చట్టాలు

అంతర్జాతీయ కార్మిక సంస్థ (ఐఎల్ఓ) కన్వెన్షన్ 182, కన్వెన్షన్ 132కు అనుగుణంగా భారత్ చట్టాలను అమలు చేస్తోంది. అందులో భాగంగానే 18 ఏళ్లలోపు బాలలు ఎక్కడా పనిచేయకుండా ఉండేలా బాల కార్మిక చట్టంలో సవరణలు తెచ్చినట్లు అధ్యయనంలో వెల్లడైందని అమెరికా కార్మికశాఖ తెలిపింది. బాలకార్మికులు లేని వ్యవస్థ కోసం జాతీయ బాల కార్మికుల కార్యక్రమం కింద ప్రత్యేక చట్టాలు, విధానాలను అమలు చేస్తున్నట్లు నివేదిక తెలిపింది. దేశంలో చిన్నారుల కోసం భారత్ ప్రత్యేకంగా ఒక జాతీయ కార్యాచరణ ప్రణాళికను అమలు చేస్తున్నట్లు అమెరికా కార్మికశాఖ తెలిపింది. అందులో భాగంగానే బాల కార్మికులు, బాలల అక్రమ రవాణా, అత్యంత ప్రమాదకర పరిస్థితులలో ఉన్న బాలలపై ప్రత్యేకంగా దృష్టి సారించినట్లు నివేదిక తెలిపింది.

### ప్రమాదకర పరిస్థితిలో బాలలు

దేశంలోని పలు ప్రాంతాలలో గార్మెంట్ పరిశ్రమలు, స్పిన్నింగ్ మిల్లులు, రాళ్ల క్వారీలు, కార్పెట్ తయారీ పరిశ్రమలతో పాటు ఇళ్లల్లోనూ బాల కార్మికులు ఉన్నట్లు అధ్యయనంలో తేలిందని నివేదిక తెలిపింది. బాల కార్మికులు వారి సామర్థ్యానికి మించి పనిచేస్తున్నట్లు కూడా వివరించింది. అనారోగ్యకరమైన వాతావరణం, ఏమాత్రం రక్షణ లేని ప్రాంతాల్లోనూ, ప్రమాదకర పరిస్థితుల్లో పని చేస్తున్నట్లు తెలిపింది. దీర్ఘకాలంగా ఇలాంటి ప్రదేశాలలో బాల కార్మిక వ్యవస్థ కొనసాగుతున్నా, చట్టాలు ఇంత పటిష్టంగా అమలు జరగటంలేదని నివేదిక తెలిపింది. నిబంధనలకు విరుద్ధంగా 18 ఏళ్లలోపు పిల్లలను పనిలో పెట్టుకున్న వారిపై చర్యలు అంతంత మాత్రంగానే ఉండటం గమనార్హమని నివేదిక తెలిపింది. ఇతర రాష్ట్రాలకు చెందిన పిల్లలను పనిలో పెట్టుకోవటంతో పెద్దగా ఎవరూ పట్టించుకుంటున్న దాఖలాలు లేవని అధ్యయనంలో తేలింది. ఈ నేపధ్యంలో బాల కార్మిక చట్టాల అమలు, ఇందుకు కేటాయిస్తున్న నిధులు, చట్టాన్ని అమలు చేసేందుకు పనిచేస్తున్న అధికారులు, ఎంత మంది నిబంధనలను ఉల్లంఘించారు, వారిలో ఎంతమందికి పెనాల్టీ విధించారోనన్న వివరాలు సేకరించి నివేదికను రూపొందించాలని అమెరికా కార్మికశాఖ సూచించింది.

### బాలల విముక్తి అవశ్యం

అమెరికాతోపాటు ప్రపంచ దేశాల్లో అన్ని వర్గాల ప్రజల హక్కులను పరిరక్షించటంతో పాటు బాల కార్మికులు, నిర్బంధ కార్మికులు, అక్రమ రవాణాకు గురవుతున్న బాలలను విముక్తి చేయాల్సిన అవసరం వుందని అమెరికా కార్మికశాఖ కార్యదర్శి అలెగ్జాండర్ అకోస్టా అభిప్రాయపడ్డారు. ఇటీవల అంతర్జాతీయ కార్మిక సంస్థ (ఐఎల్ఓ) అంచనా ప్రకారం ప్రపంచంలో 152 మిలియన్ల బాల కార్మికులు ఉన్నట్లు చెప్పారు. ప్రతి పదిమంది బాలల్లో కనీసం ఒక బాల కార్మికుడు ఉంటున్నట్లు ఆయన తెలిపారు. ప్రపంచంలో 25 మిలియన్ల మంది నిర్బంధ బాల కార్మికులుగా పనిచేస్తున్నట్లు ఆయన తెలిపారు.

# దివ్యాంగులకు అండగా చట్టాలు

## కృష్ణా జిల్లా న్యాయ సేవాధికారసంస్థ కార్యదర్శి పీఆర్ రాజీవ్

దివ్యాంగులకు రక్షణగా అనేకచట్టాలు ఉన్నాయని కృష్ణా జిల్లా న్యాయ సేవాధికారసంస్థ కార్యదర్శి పీఆర్ రాజీవ్ అన్నారు. మచిలీపట్నంలోని జిల్లా న్యాయసేవా సదన్‌లో అంగన్‌వాడీ కార్యకర్తలకు ఇటీవల న్యాయవిజ్ఞాన సదస్సు నిర్వహించారు. ఈసదస్సులో పాల్గొన్న ఆయన మాట్లాడుతూ వికలాంగులకు ఉచిత న్యాయసహాయం అందిస్తున్నందున వినియోగించుకోవాలన్నారు. ప్రభుత్వం నుంచి అందే సేవల్లో జాప్యం జరిగినా సంస్థ దృష్టికి తీసుకువస్తే తగు చర్యలు తీసుకుంటామన్నారు. కార్యకర్తలు అందరూ చట్టాలపై అవగాహన పెంచుకుని వారి వారి ప్రాంతాల్లో ప్రజలకు అవగాహన కల్పించాలని సూచించారు. వైద్యపరమైన సేవలు అందకపోయినా తగు చర్యలు తీసుకుంటామని అన్నారు. మహిళలకు కూడా ఉచిత న్యాయసహాయం అందిస్తామని వివిధ దాడుల్లోని బాధితులకు విక్టిమ్ కాంపన్‌సేషన్ స్కీంలో భాగంగా పరిహారం అందిస్తున్నట్లు తెలిపారు. న్యాయవాది చీలిముసలయ్య వివిధ చట్టాలను వివరించారు. ఐసీడీఎస్ అర్బన్ సీడీపీవో జయలక్ష్మి, ఆయా ప్రాంతాల అంగన్‌వాడీ కార్యకర్తలు పాల్గొన్నారు.



### విద్యార్థులు ఒత్తిడికి దూరంగా ఉండాలి

విద్యార్థులు ఒత్తిడికి దూరంగా ఉండాలని వ్యక్తిత్వ వికాస నిపుణులు విడియాల చక్రవర్తి, సుధామయిలు తెలిపారు. పట్టణంలోని వెంకటేశ్వర డిగ్రీకళాశాలలో నిర్వహించిన సదస్సులో పాల్గొని వారు ఒత్తిడిని జయించడమెలా అనే అంశంపై వివరించారు. ఈసందర్భంగా చక్రవర్తి మాట్లాడుతూ విద్యార్థులు ప్రతి ఒక్కరూ లక్ష్యాన్ని నిర్దేశించుకుని దాన్ని సాధించడానికి తపనతో కృషిచేయాలన్నారు. సమయాన్ని విభజించుకుని చదువుకోవడం ద్వారా ఒత్తిడికి దూరంగా ఉండొచ్చని అన్నారు. యోగా, ధ్యానంతోపాటు వ్యాయామం కూడా అవసరమని చెప్పారు. ప్రిన్సిపల్ జీవి స్వామి, అధ్యాపకులు అజయ్, సీతారామయ్య, రమేష్, నాగశివ, జగదీష్ తదితరులు పాల్గొన్నారు.

# బాలిక వివాహాన్ని అడ్డుకున్న రక్షిత బృందం

కడప జిల్లా వేంపల్లి మండలంలోని బక్కన్నగారిపల్లెలో వచ్చే నెలలో జరగనున్న ఓ బాలిక వివాహాన్ని ఇటీవల రక్షిత మహిళా పోలీసు బృందం అడ్డుకుంది. ఈమేరకు సదరు బాలిక తల్లిదండ్రులకు అధికారులు కౌన్సెలింగ్ ఇచ్చి 18 ఏళ్లు నిండిన తర్వాతే ఆ బాలికకు వివాహం చేస్తామని ఒప్పంద పత్రాలను రాయించుకుని ఇళ్లకు పంపించారు. గ్రామానికి చెందిన బాలికను పులివెందుల మండలం నల్లపురెడ్డిపల్లెకు చెందిన ఓ యువకునికి ఇచ్చి నవంబరు 10న వివాహం చేయాలని నిర్ణయించారు. స్థానికులు చరవాణి ద్వారా రక్షిత మహిళా బృందానికి సమాచారం అందించారు. ఈ విషయం తెలుసుకున్న సదరు బృంద హెడ్ కానిస్టేబుల్ శ్రీదేవి, ఐసీడీఎస్ సూపర్‌వైజరు మాబున్ని, 10 మంది సిబ్బందితో గ్రామానికి వెళ్లి సదరు బాలికను, ఆమె తల్లిదండ్రులను తహసీల్దారు కార్యాలయానికి తీసుకువెళ్లారు. బాల్య వివాహాల వల్ల జరిగే అనర్థాల గురించి తహసీల్దారు ప్రభాకర్‌రెడ్డి కుటుంబ సభ్యులకు వివరించారు. అనంతరం ఈ బాలిక పెళ్లికి సరైన వయసు వచ్చిన తరువాతే వివాహం చేస్తామని ఒప్పంద పత్రం రాయించుకుని వెనక్కు పంపించారు. దీంతో సమస్య సద్దుమణిగింది.

# పౌష్టికాహారంతో సంపూర్ణ ఆరోగ్యం

ప్రభుత్వం ద్వారా అమలు అవుతున్న ఆరోగ్య పథకాలను సద్వినియోగం చేసుకుంటూ ఆరోగ్య ఆంధ్రప్రదేశ్ సాధించాలని పశ్చిమగోదావరి జిల్లా వైద్య ఆరోగ్యశాఖ అధికారి డాక్టర్ సుబ్రహ్మణ్యేశ్వరి పేర్కొన్నారు. ఏలూరు నగర పాలక సంస్థ ప్రాంగణంలోని మెప్మా కార్యాలయంలో జాతీయ పౌష్టికాహార మాసోత్సవ కార్యక్రమాన్ని ఇటీవల నిర్వహించారు. ఈ సందర్భంగా ఆమె మాట్లాడుతూ పౌష్టికాహార ప్రదర్శనలో ఏర్పాటు చేసిన వంటకాలు హృద యాన్ని ఆకట్టుకునేలా ఉన్నాయన్నారు. ప్రజలకు తక్కువ ఖర్చుతో ఎక్కువ పోషకాలు కలిగిన వంటకాలను పరిచయం చేయడం ఎంతో అభినందనీయమన్నారు. జన సంచారం ఎక్కువగా ఉండే ప్రాంతాలలో పౌష్టికాహార కేంద్రాలు ఏర్పాటు చేసి ప్రజలకు అవగాహన కల్పించడంతోపాటు పదార్థాలను అందజేసేలా చర్యలు తీసుకోవాలన్నారు. తద్వారా మహిళలకు ఆర్థికాభివృద్ధితో పాటు ప్రజలకు మంచిఆరోగ్యం ఇచ్చిన వారమవుతామని చెప్పారు. మెప్మా పీడీ రవికుమార్ మాట్లాడుతూ మనిషి ఆరోగ్యంగా ఉండాలంటే పౌష్టికాహారం తీసుకోవడంతోపాటు పరిసరాలు కూడా పరిశుభ్రంగా ఉంచుకోవాలన్నారు. పౌష్టికాహార లోపం నానాటికి పెరుగుపోతోందని, ఇది మాతా శిశు ఆరో గ్యంపై తీవ్రప్రభావం చూపుతోందన్నారు. ఈ నేపథ్యంలో జాతీయ పోషక ఆహారమిషన్ ద్వారా పోషకాహారం అందించే ప్రయత్నాలు జరుగుతున్నాయని చెప్పారు.



ఇందులో భాగంగా మెప్మా ఆధ్వర్యంలో సెప్టెంబరు నెలను జాతీయ పోషకాహార మాసోత్సవంగా ప్రకటించి జిల్లాలో ఏలూరు, తాడేపల్లి గూడెం, తణుకు, పాలకొల్లు, భీమవరం, నరసాపురం, నిడదవోలు, జంగారెడ్డిగూడెం ప్రాంతాలలో క్షేత్రస్థాయిలో స్వయం సహాయక సంఘ సభ్యులతో పోషకాహార ప్రాధాన్యంపై గర్భిణులకు, ప్రజలకు అవగాహన కల్పిస్తున్నామన్నారు. సమాచారశాఖ ఏడీ కె.సుభాషిణి మాట్లాడుతూ ఆరోగ్యం ప్రసాదించే చిరు ధాన్యాలను ఈ తరానికి పరిచయం చేయాలని, పౌష్టికాహారం ప్రతి ఒక్కరికి అందాలనే ఉద్దేశ్యంతో ఏర్పాటు చేసిన ఈ కార్యక్రమం అందరినీ ఆకట్టుకుందన్నారు. ఈ కార్యక్రమంలో డీఈవో రేణుక, సాంఘిక సంక్షేమశాఖ డీడీ రంగలక్ష్మీదేవి, ఆరోగ్య, పౌష్టికాహార విభాగం కోఆర్డినేటర్ పిహెచ్కె మహలక్ష్మి, ఐసీడీఎస్ పీడీ కె.విజయకుమారి, నగరపాలక సంస్థ కమిషనర్ ఎ.మోహనరావు తదితరులు పాల్గొన్నారు.

# శక్తిమంత మహిళా వ్యాపారుల్లో జీఐసీ ఛైర్మన్ అలైస్ వైద్యన్



ప్రపంచంలోని అత్యంత శక్తిమంత మహిళా వ్యాపారుల జాబితాలో జనరల్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా (జీఐసీ ఆర్ఈ) ఛైర్మన్, మేనేజింగ్ డైరెక్టరు (ఎండీ) అలైస్ వైద్యన్ చోటు దక్కించుకున్నారు. మనదేశం నుంచి జాబితాలో స్థానం పొందింది ఈమె ఒక్కరే. ప్రస్తుత సంవత్సరానికిగాను అమెరికా వెలుపల 50 మంది శక్తిమంత మహిళా వ్యాపారులతో ఫార్చ్యూన్ మ్యాగజైన్ ఈ జాబితా రూపొందించింది. ఇందులో అలైస్ వైద్యన్‌కు 47వ ర్యాంకు లభించింది. గ్లాక్సోస్మిత్‌క్లైన్ ముఖ్య కార్యనిర్వహణ అధికారి ఎమ్మా వామ్స్లేకు అగ్రస్థానం దక్కింది. నాలుగేళ్లుగా మొదటి ర్యాంకులో ఉన్న బాన్కో సాంటాండెర్ ఎగ్జిక్యూటివ్ ఛైర్మన్ అనాబోటిన్ ఈసారి ఆ స్థానాన్ని నిలబెట్టుకోలేకపోయారు. అమెరికా వెలుపల అత్యంత శక్తిమంత మహిళా వ్యాపారుల జాబితాను 18 ఏళ్లుగా ఫార్చ్యూన్ రూపొందిస్తోంది. ఈ 50మంది 19 దేశాలకు చెందిన వివిధ రంగాల్లోని వారు. వైద్యన్ 2016లో జీఐసీ ఛైర్మన్‌గా పగ్గాలు స్వీకరించారు. ఆమె నాయకత్వంలో ప్రపంచంలోని 10 అత్యుత్తమ రీఇన్సూరెన్స్ కంపెనీల్లో ఒకటిగా జీఐసీ స్థానాన్ని పొందింది.



# నిర్ణీత గడువులో ఉద్యోగుల సమస్యలు పరిష్కరించాలి

## స్త్రీ శిశు సంక్షేమశాఖ ఉద్యోగ సంఘం రాష్ట్ర అధ్యక్షులు సుబ్బరాజు డిమాండ్

***ఎవరి జీవితం చూసినా హడావిడే...ఎవరిని కదిపినా సంతోషం కరువే. భార్యభర్తలిద్దరూ ఉద్యోగాలు చేస్తేనే గడిచేరోజులివి. ఎన్నో సవాళ్ళు మరెన్నో ఒత్తిళ్ళు. మనకోసం మనం సమయం కేటాయించుకునే పరిస్థితి లేకపోవటం. లేదంటే సానుకూల ఆలోచనలకు ప్రతికూల మబ్బులు కమ్మేయడం కారణం ఏదైనా కూడా నష్టపోయేది మనమే. ఈ పరిస్థితి ఇలాగే కొనసాగితే అనారోగ్యం పాలవ్వక తప్పదు. ఇంకా శృతిమించితే జీవితం చేజారిపోతుంది. ఇలాంటి విపత్కర పరిస్థితులు నడుమ రాష్ట్ర మహిళా స్త్రీశిశు సంక్షేమశాఖ ఉద్యోగులు పనిచేస్తున్నారు. సెలవులు లేవు, ఆదివారాలు, పండుగ దినాలు లేవు. ఉదయం లేచింది మొదలు రాత్రి పడుకునే వరకు దాదాపు పది, 12 గంటలు పైనే ఉద్యోగ బాధ్యతలు నిర్వర్తించవలసివస్తుంది....***

ఈ పరిస్థితుల్లో రాష్ట్ర మహిళా స్త్రీశిశు సంక్షేమ సంఘం నాయకులు ఒక అడుగు ముందుకేసి తమశాఖలో ప్రస్తుతం వున్న పరిస్థితులు మారాలి. ఉద్యోగులపై పనిభారం, ఒత్తిడి తగ్గించాలని ఇటీవల జెఎసి అత్యవసర సమావేశాన్ని విజయవాడలో ఏర్పాటు చేసారు. తమశాఖలో జరుగుతున్న విపరీత పరిణామాలు, అధికారుల నిరంకుశ నిర్ణయాలు నిబంధనలకు విరుద్ధంగా ఉన్నతాధికారులు తీసుకునే కఠిన నిర్ణయాలు. వీటివలన ఇబ్బంది పడుతున్న ఉద్యోగులు చివరికి అంగన్‌వాడీ కార్యకర్తల విషయంపై కూడా చర్చించి కీలక నిర్ణయాలు తీసుకున్నారు. తమశాఖలో ఒక విధంగా చెప్పాలంటే మానవహక్కుల ఉల్లంఘన జరుగుతుంది అంటూ రాష్ట్ర అధ్యక్షులు అధికారుల తీరును ఎండగట్టారు. జాబ్ చార్ట్ ప్రకారం కాకుండా పది 15 గంటలు పని చేయించుకోవటం ఇతర శాఖల పనులు సైతం అంగన్‌వాడీ ఉద్యోగులతో చేయించటం చేయకపోతే వేధింపులు ఇవి చాలవు అన్నట్లు వివిధ రకాలైన ఆన్‌లైన్ నివేదికలు, గంటకో రిపోర్టు ఇక వీడియో కాన్ఫరెన్స్‌లు, టెలికాన్ఫరెన్స్‌లు జిల్లా, మండల గ్రామస్థాయిలో లెక్కకు మించిన రివ్యూ మీటింగ్‌లు అయితే చెప్పనవసరంలేదు. అవసరం ఉన్నా లేకపోయినాగాని ఎన్నోరకాల ఆన్‌లైన్ రిపోర్టులు రోజుకో కొత్తరకం యాప్ ఈరోజుఉన్న యాప్ రేపు ఉండకపోవటం. ఇలాంటి అన్ని విషయాలపై సుదీర్ఘంగా చర్చించారు.



ముఖ్యంగా ఉద్యోగుల చేత పనిచేయించుకునే అధికారులు వారి సంక్షేమం విషయంలో కూడా అంత శ్రద్ధ తీసుకోవాలని నాయకులు కోరారు. ఉద్యోగులకు వారి విధులతోపాటు హక్కులు కూడా ఉంటాయని వాటిని కూడా పరిగణనలోకి తీసుకోవాలన్నారు. ఉదాహరణకు పొరుగునే ఉన్న తెలంగాణ రాష్ట్రంలో ఉద్యోగులకు పదోన్నతులు కల్పించి వారి సంక్షేమానికి పెద్దపీట వేస్తుంటే ఏపిలో ఆ పరిస్థితి కానరావటం లేదన్నారు. గడిచిన 4 ఏళ్ళల్లో రెండు పర్యాయములు డిపిసి ద్వారా పదోన్నతులు కల్పించారన్నారు. మన రాష్ట్రంలో నాలుగేళ్ళు పైబడినాగాని ఒక్క డిపిసి కూడా జరగకపోవటం దారుణమన్నారు. ఇటీవల ప్రభుత్వం ఆర్‌జెడి మరియు పిడిలకు పరిమిత సంఖ్యలో పదోన్నతులు కల్పించారే తప్ప మన కమీషనరేట్ స్థాయిలో పదోన్నతులు కోసం ఎటువంటి కార్యాచరణ జరగలేదన్నారు. డిపార్టుమెంటులో పనిభారం ఒత్తిళ్ళ మూలంగా చాలామంది అనారోగ్యం బారిన పడుతున్నారని ఈ విషయాలు అన్నిటిపై అధికారులు చర్చలకు ఆహ్వానించేలా నిర్ణీత గడువులో సమస్యల పరిష్కారానికి చొరవచూపని అధికారులపై ఒత్తిడి తేవాలని జెఎసి ఏకగ్రీవంగా తీర్మానించింది. యూనియన్ డిమాండ్లకు అధికారులు స్పందించకపోతే తదుపరి కార్యాచరణ వెంటనే ప్రకటిస్తామని తెలియజేసారు. ప్రతి ప్రభుత్వశాఖలో నిర్ణీత గడువులో పదోన్నతులు కల్పిస్తుంటే కేవలం ఒక్క మహిళా స్త్రీ శిశు సంక్షేమశాఖలోనే ఈ పరిస్థితులు భిన్నంగా ఉన్నాయన్నారు. పర్యవేక్షకుల రెగ్యులైజేషన్ విషయంలో కూడా తాత్సారం చేస్తున్నారని ఏళ్ళ తరబడి వారికి రావలసిన బెనిఫిట్స్ కోల్పోతున్నారన్నారు. ఇప్పటికైనా ఉన్నతాధికారులు స్పందించి ఉద్యోగుల సమస్యల పరిష్కారానికి చొరవ చూపాలన్నారు.

# చట్టాలనేకం... బాల్యం... అమూల్యం

బాల్యం ఓ మధురమైనది. జీవితంలో ఏవి ఉన్నా, ఎవరు ఉన్నా లేకున్నా నెమరు వేసుకొనడానికి మిగిలిన ఓ తియ్యని జ్ఞాపకం. ప్రతి ఒక్కరి జీవితంలో అతి సున్నితమైన దశ. రేపటి జీవితాన్ని సుగమం చేసుకోవటానికి ఈరోజు వేసుకొనే ఓ చక్కటి పునాది. ఇటువంటి బాల్యం ప్రస్తుతం హెచ్చుమీరుతున్న ఆధునిక పోకడల కారణంగా బందీఖానాగా మారుతోంది. ప్రభుత్వం బాలల సంరక్షణే ధ్యేయంగా వారి భవిత కోసం ఎన్నో చట్టాలు చేసినా అవన్నీ బుట్టదాఖలే అవుతున్నాయి.



## హక్కులను గుర్తించాలి

బాలలకు హక్కులు ఉన్నాయన్న విషయాన్ని ప్రతి తల్లిదండ్రులు, వారి ఉపాధ్యాయులు గుర్తించాలి. వాటిపై అవగాహన కల్గి ఉండాలి. ఈ హక్కులపై ఐక్యరాజ్యసమితి అంతర్జాతీయ సదస్సు నిర్వహించి ప్రత్యేక ఒడంబడికను సైతం ప్రకటించింది. ఈ ఒడంబడిక ప్రకారం బాలలకు ప్రధానంగా నాలుగు హక్కులను కల్పించారు. అవి జీవించే హక్కు, రక్షణ హక్కు అభివృద్ధి హక్కు, భాగస్వామ్యపు హక్కు. మనదేశంలో 1992, డిసెంబర్ 11 నుంచి ఈ ఒడంబడిక అధికారికంగా అమల్లోకి వచ్చింది. ప్రతి చిన్నారికి తల్లిదండ్రులే ప్రథమ గురువులు. వారి నడవడికలకు ప్రత్యక్ష రూపాలు. పురాతన సంస్కృతికి ఫుల్‌స్టాప్ పెట్టి నవ నాగరికతను స్వాగతించాల్సిన అవసరం ఎంతైనా వుంది. పిల్లల్ని పెంచే విధానంలో ఆడ, మగ మధ్య తేడా చూపించరాదు.

## ఉపాధ్యాయులూ ఇలా చేద్దాం

* సాటి మగ లేదా ఆడ పిల్లలతో పోలుస్తూ విద్యార్థుల్ని దూషించకండి.
* లింగ వివక్షకు బీజం పాఠశాలలోనే పడుతుంది. బాలబాలికల మధ్య ఉత్తమ స్నేహాన్ని చిగురించేలా చేయాలి.
* పాఠాల్లో చెప్పే ఉదాహరణల్లో బాలబాలికల మధ్య తేడాలు రానీయకండి.
* సమాజంలో జరుగుతున్న అన్యాయాన్ని ఎదుర్కొనే ధైర్యాన్ని వారిలో పెంపొందించాలి.

## చిన్ని పాపలకు రాజ్యాంగం అండ

ఐక్యరాజ్యసమితితోపాటు భారతదేశం కూడా తన రాజ్యాంగంలో బాలల హక్కుల కోసం ప్రత్యేక అధికరణలు పొందుపరచటంతో పాటు కొన్ని ప్రత్యేక చట్టాలు చేసింది. అవి. ఆర్టికల్ 14. సమానత్వపు హక్కు. ఆర్టికల్ 21(ఎ) ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్యా హక్కు. ఆర్టికల్ 22, నిర్బంధం, శిక్ష నుంచి రక్షణ పొందే హక్కు. ఆర్టికల్ 23 అక్రమ రవాణా, కట్టుబానిసత్వం నుంచి రక్షణ పొందే హక్కు. ఆర్టికల్ 350(ఎ). మాతృభాషలో విద్యాభ్యాసం చేసే హక్కు. ఆర్టికల్ 39, తగని పనుల నుంచి విముక్తి పొందే హక్కు. వీటితోపాటు పరిశ్రమల చట్టం (1982), గనుల చట్టం (1952), ప్లాంటేషన్ కార్మికచట్టం (1951), వెట్టి చాకిరి నిషేధ చట్టం (1976), బాల్య వివాహాల నిరోధక చట్టం (1929), బాలల న్యాయ చట్టం (2000) ఇలా ఎన్నో చట్టాలు బాలలకు అండగా ఉన్నాయి.

## ఈ వాస్తవాలతో ఆశ్చర్యం తప్పదు

భారత స్త్రీ–శిశు సంక్షేమ మంత్రిత్వశాఖ 2007లో చేసిన సర్వే ప్రకారం వెల్లడైన గణాంకాల్లో

* ప్రతి ముగ్గురిలో ఇద్దరు శ్రమదోపిడీకి గురవుతున్నారు.
* 69 శాతం శ్రమ దోపిడీకి గురవుతున్న పిల్లల్లో సుమారు 55 శాతం బాలురు.
* కుటుంబపరంగా శ్రమ దోపిడీకి గురవుతున్న వారిలో సుమారు 88 శాతం తల్లిదండ్రుల ద్వారా దోపిడీకి గురవుతున్నారు.
* సుమారు 53 శాతం బాలలు ఒకటి లేదా పలు రకాలైన లైంగిక వేధింపులకు గురవుతున్నారు. వీటిలో ఏపీతోపాటు అస్సాం, బీహార్, ఢిల్లీలు అగ్రస్థానంలో ఉన్నాయి.
* సుమారు 21 శాతం మంది అత్యాచారాలకు గురవుతున్నారు.
* 50 శాతం అత్యాచారాలు నమ్మకస్తులు, కుటుంబ సభ్యుల ద్వారానే జరుగుతున్నాయి.
* మానసిక వేధింపుల విషయంలో సుమారు 83 శాతం తల్లిదండ్రులే నిందితులు.



# అంగన్‌వాడీ కేంద్రాల పర్యవేక్షణకు కమిటీలు

## ఒక్కో కమిటీలో 11 మంది సభ్యులు

అంగన్‌వాడీ కేంద్రాల ద్వారా మహిళలు, పిల్లల పోషణకు సంబంధించి అందుతున్న సేవలు పర్యవేక్షించటానికి తగిన మద్దతు అందించటానికై రాష్ట్ర, జిల్లా ఐసిడిఎస్ బ్లాక్‌స్థాయి అంగన్‌వాడీ కేంద్రాలస్థాయిలో కమిటీలు ఏర్పాటుచేయనున్నారు. దానికి సంబంధించి విధివిధానాలు కూడా ఆయా ప్రాజెక్టు డైరెక్టర్లకు, సిడిపిఒలకు కూడా చేరాయి. గతంలో ఉండే కమిటీలనే పునరుద్ధరించారు. ఈ కమిటీ కేవలం పర్యవేక్షణే మాత్రం కాక సూచనలు, సలహాలు, మద్దతు కూడా ఇస్తారు. చాలా జిల్లాల్లో అంగన్‌వాడీ కేంద్రాల్లో పలు అక్రమాలు చోటుచేసుకుంటున్నాయి. పిల్లలు లేకపోయినా ఉన్నట్లు రికార్డుల్లో చూపిస్తూ సరుకులు మాయం చేసి సొమ్ములు చేసుకుంటున్నారన్న విషయం ఇటీవల రాష్ట్రవ్యాప్తంగా జరిగిన విజిలెన్స్ తనిఖీల్లో బయటపడింది. దానికితోడు అంగన్‌వాడీ కార్యకర్త వారి సహాయకులు నిర్లక్ష్యధోరణిలో వ్యవహరిస్తూ పసిపిల్లల పౌష్టికాహారానికి గండికొడుతున్నారు. ఇలాంటివారు కోసం ప్రభుత్వం అంగన్‌వాడీ కేంద్రానికో కమిటీని నియమించనున్నారు. మొత్తం దీనిలో 11 మంది సభ్యులుంటారు. వీరంతా ఆయా కేంద్రాలను పర్యవేక్షించటంతోపాటు ప్రతినెలా సమావేశాన్ని నిర్వహించి ఆయా అంగన్‌వాడీ కేంద్రాల పనితీరుపై ఉన్నతాధికారులకు తెలియపరుస్తారు. వాస్తవంగా కేంద్రాలను పర్యవేక్షించటానికి సిడిపిఒతోపాటు సూపర్‌వైజర్లు ఉన్నారు. కాగా తగినంతమందిలేక ఉన్న సూపర్‌వైజర్లకు పనిభారం ఎక్కువ కావటం ఒక సెక్టారు పరిధిలో దాదాపు 20 నుండి 25 సెంటర్లు పర్యవేక్షించాల్సిన అవసరం ఉండటంతో తగినంత సమయం కేంద్రాల పర్యవేక్షణకు కేటాయించలేకపోతున్నారు. దానికితోడు గతంలో ఎన్నడూ లేని విధంగా ఐసిడిఎస్ ద్వారా పలు సంక్షేమ కార్యక్రమాలు అమలు చేయటం వాటికి సంబంధించి ఆన్‌లైన్ రిపోర్టులు, శిక్షణలు, ఎత్తులు, బరువులు వేయటం తదితర కారణాలు కూడా ఉన్నాయి. ఇటీవలే ప్రవేశపెట్టిన బాలసంజీవిని పథకం కార్యకర్తలకు ఇబ్బందిగా ఉంటుంది. దానిమూలంగా పూర్వ ప్రాథమిక విద్య సైతం కుంటుపడిందని అంగన్‌వాడీలు చెబుతున్నారు. సమయమంతా వండి పెట్టటానికే సరిపోతుందంటున్నారు. వీటినన్నిటిని దృష్టిలో పెట్టుకుని అంగన్‌వాడీల సేవలను మరింత పారదర్శకంగా అందించేందుకు ఈ కమిటీలను నియమించనుంది. ఈ కమిటీల్లో 11 మంది సభ్యులు ఉంటారు. ఆయా కమిటీలకు గ్రామ ప్రత్యేకాధికారి ఛైర్మన్‌గా ఉంటారు. ఈయనతోపాటు ఇద్దరు మహిళామండలి సభ్యులు, ఇద్దరు కమ్యూనిటీ ఉత్తమ కార్యనిర్వాహక సభ్యులు, ఆశా కార్యకర్త, ఉపాధ్యాయుడు, పదవీవిరమణ చేసిన ప్రభుత్వ అధికారి, అంగన్‌వాడీ కేంద్రానికి వచ్చే పిల్లల తండ్రిగాని, తల్లి గాని అంగన్‌వాడీ కార్యకర్త సబల కార్యకర్తను కమిటీలో సభ్యులుగా నియమిస్తారు. దానికి సంబంధించి ఉత్తర్వులు 49,50 పేజీల్లో చూడగలరు.

# అంగన్వాడీ పర్యవేక్షణ కమిటీలను రద్దు చేయాలి

అంగన్వాడీలను వేధింపులకు గురి చేసే పర్యవేక్షణ కమిటీలను తక్షణమే రద్దు చేయాలని కోరుతూ నగరంలోని ఐసీడీఎస్ కడప అర్బన్ ప్రాజెక్టు కార్యాలయం ఎదుట సీఐటీయూ నేతృత్వంలోని అంగన్వాడీలు ధర్నా చేపట్టారు. ఈ సందర్భంగా జిల్లా అధ్యక్ష, కార్యదర్శులు రాజకుళాయమ్మ, లక్ష్మీదేవి మాట్లాడుతూ అంగన్వాడీలకు వేతనాలు పెంచుతున్నట్లు ప్రకటించి మరోవైపు వేధింపులు చేసేందుకు పర్యవేక్షణ కమిటీలను ఏర్పాటు చేయడంలో ప్రభుత్వ ఉద్దేశమేమిటని ప్రశ్నించారు. కనీస వసతులు కల్పించకుండానే పర్యవేక్షణ కమిటీలు ఏర్పాటు చేస్తే కార్యకర్తలను వేధించడమే పనిగా పెట్టుకుంటారన్నారు. తక్షణమే అంగన్‌వాడీల్లోని సూపర్‌వైజర్ పోస్టులను భర్తీ చేయాలని అందులో కార్యకర్తలకు ప్రాధాన్యత ఇస్తూ పదోన్నతులు కల్పించాలని డిమాండ్ చేశారు. జీవో నంబరు 38ని రద్దు చేసి మినీ వర్కర్లకు పదోన్నతులు కల్పించాలని కేంద్రాలను మెర్జి చేయవద్దని, కేంద్రాల అద్దె, టీఏ, డీఏలు చెల్లించాలని కోరారు. ఆందోళనలో నగర అధ్యక్షురాలు అంజనాదేవి, మేరి, వెంగమాంబ, సుభద్ర, వెంకటసుబ్బమ్మ, దుర్గ, వినీల, రామసుబ్బమ్మ, భారతి, అలివేణి, సునీత పాల్గొన్నారు.

# అంగన్‌వాడీల్లో విజిలెన్స్ తనిఖీలు

## భయాందోళనలో ఉద్యోగులు ✦ తనిఖీల్లో బయటపడిన పలు అక్రమాలు

రికార్డులు నిర్వహణ, విద్యార్థుల హాజరులో వ్యత్యాసాలు మరికొన్నిచోట్ల ఆహార పదార్థాల్లో నాణ్యతలోపాలు, అక్రమ నిల్వలు ఇటీవల రాష్ట్రవ్యాప్తంగా అంగన్‌వాడీ కేంద్రాలపై జరిగిన విజిలెన్స్ అండ్ ఎన్‌ఫోర్స్‌మెంట్ దాడుల్లో గుర్తించిన అంశాలివి. దాదాపుగా రాష్ట్రమంతా అన్ని అంగన్‌వాడీల్లోనూ చిన్నారుల సంఖ్యకు, హాజరుకు వ్యత్యాసాలున్నట్లు కనుగొన్నారు. రాష్ట్రంలో జరిగిన ఈ ఆకస్మిక తనిఖీలతో ఐసిడిఎస్ అధికారులు బెంబేలు ఎత్తిపోయారు. ఇప్పటికి కొన్ని జిల్లాల్లో సూపర్‌వైజర్లు సిడిపిఒలు తీవ్ర భయాందోళనలు ఉన్నారు. విజిలెన్స్ అధికారుల నివేదికలో ఏమి ఉంటాడో అని ఆత్రుతగా ఎదురుచూస్తున్నారు. వాస్తవంగా దేశంలోనే అతి పెద్ద పోషకాహార సంస్థ అయిన ఐసిడిఎస్‌లో అక్రమాలు రాజ్యమేలుతున్నాయని చిన్నారులకు బాలింతలకు గర్భిణీలకు అందచేయవలసిన పౌష్టికాహారాన్ని కొందరు పక్కదారి పట్టించి సొమ్ములు చేసుకుంటున్నారు. గ్రామీణ ప్రాంతాల్లో నిరుపేదలు పోషకాహారంతో అల్లాడుతున్న చాలా మంది అంగన్‌వాడీ కేంద్రాలను వినియోగించుకోవటంలేదు. ఒకపక్క ఏటా పోషకాహారలోపంతో చిన్నారులు ఆరోగ్యసమస్యలు ఎదుర్కొంటూ, బాలింతలు, గర్భిణీలు పలు సందర్భాల్లో పోషకాలలేమితో మృతిచెందుతున్నారు. దీనితో అంగన్‌వాడీ కేంద్రాలపై విజిలెన్స్ అధికారులు దృష్టి సారించి రాష్ట్రవ్యాప్తంగా 12 జిల్లాల్లో ఏకకాలంలో ఈ దాడులు నిర్వహించటం విశేషం. శ్రీకాకుళం జిల్లాలో తిత్లీ తుఫాన్ కారణంగా ఆ ప్రాంతంలో తనిఖీలు నిర్వహించలేదు. అయితే తనిఖీల్లో మాత్రం భయంకర మైన నిజాలు వెలుగు చూసాయని అధికారులు చెబుతున్నారు. అంగన్‌వాడీ కేంద్రాల్లో పారిశుధ్య పరిస్థితులు, సరకు నిల్వలు, హాజరుశాతం తదితర అంశాల్లో పొంతన లేదని తేలింది. పిల్లలు హాజరు విషయంలో వ్యత్యాసాలు ప్రతి కేంద్రంలోనూ చోటు చేసుకున్నాయి. రాష్ట్రవ్యాప్తంగా 162 అంగన్‌వాడీ కేంద్రాల్లో ఏకకాలంలో తనిఖీలు నిర్వహించారు. మొత్తం 66 కేంద్రాల్లో అవకతవకలు నిర్వహణలోపాలు బయటపడ్డాయి. తనిఖీల్లో 23 అంశాలను పరిగణనలోకి తీసుకున్నామని విజిలెన్స్ అండ్ ఎన్‌ఫోర్స్‌మెంట్ విభాగం డిజి గౌతం సవాంగ్ వెల్లడించారు. తనిఖీల్లో చిన్నారులకు బాలామృతం సరఫరా తీరుతెన్నులు, గర్భవతులు, బాలింతలకు పోషకాహారం అందుతున్న తీరు బాలబాలికలకు గుడ్లు, పాలు అందచేస్తున్న పద్ధతులు, వాటి నాణ్యత, అంగన్‌వాడీ కేంద్రాల్లో మరుగుదొడ్ల నిర్వహణ కార్యకర్తల ఆయాల పనితీరు అంశాలను ప్రధానంగా తీసుకున్నారు. అయితే తనిఖీల్లో గుర్తించిన లోపాలు మాత్రం కేంద్రంలో హాజరైన వారి కంటే రికార్డుల్లో ఎక్కువగా చూపించటం అనంతపురం జిల్లాలో బాలామృతం, సరఫరా సవ్యంగా లేకపోవటం చిత్తూరు జిల్లాలో అయితే కుళ్ళిన గుడ్లను లబ్దిదారులకు అందిస్తున్నారు. విజయనగరంలో అయితే గుడ్లు సరఫరా లేదు. కర్నూలు జిల్లాలోనూ కొన్నిచోట్ల ఇదే పరిస్థితి. కేంద్రాల్లో ఉన్న సరకు నిల్వల వివరాలను దస్త్రాల్లో నమోదు చేసే విషయంలో అవకతవకలకు పాల్పడుతున్నారు. పలుచోట్ల స్టాకు రిజిష్టర్ పెన్సిల్‌తో రాయటం వంటివి చేస్తున్నారు. కృష్ణాజిల్లాలో అయితే నిర్దేశిత మెనూ పాటించడం లేదు. కడపలో టిహెచ్‌ఆర్ పద్ధతి సాగుతుంది. కొన్ని కేంద్రాల్లో ఆమాటల రాకపోవటం ఆలస్యంగా ఆహారం అందచేయటం వంటివి గుర్తించారు. అయితే గుర్తించిన లోపాలకు ప్రభుత్వానికి నివేదిస్తాం అని డిజి గౌతం సవాంగ్ చెప్పారు.

## ఐసీడీఎస్ పీడీగా లీలావతి

స్త్రీ శిశు సంక్షేమశాఖ (ఐసీడీఎస్) పీడీగా పూర్తి అదనపు బాధ్యతలను (ఎఫ్ఏసీ) లీలావతికి అప్పగిస్తూ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి అరుణ్‌కుమార్ ఉత్తర్వులు జారీచేశారు. ఈమె నంద్యాల రూరల్ ప్రాజెక్టు సీడీపీవోగా బాధ్యతలు నిర్వహిస్తున్నారు. జిల్లా ఐసీడీఎస్‌లో రెగ్యులర్ పీడీగా జుబేదాబేగం పదవీ విరమణ పొందాక తాత్కాలిక బాధ్యతలతో పలువురు అధికారులు కొనసాగారు. స్పెషల్ డిప్యూటీ కలెక్టర్ శశిదేవి పీడీగా అదనపు బాధ్యతలు నిర్వహిస్తుండేవారు. ఆమె స్థానంలో లీలావతికి ఉత్తర్వులు అందాయి. మొన్నటి వరకు పనిచేసిన పీడీ శశిదేవి పదవీవిరమణ దగ్గరపడటం, రెండు ఉద్యోగాల్లో ఒత్తిళ్ళు అధిగమించలేక స్వచ్ఛందంగా పీడీగా కొనసాగలేనని ఉన్నతాధికారులకు విన్నవించుకున్నట్లు తెలిసింది.

# అయోడిన్ లోపం మూలంగానే ఆరోగ్య సమస్యలు

## తూర్పుగోదావరి జిల్లా పి.డి సుఖజీవన్‌బాబు



అయోడిన్ ఉప్పు వాడకం పెరుగుదల ఉన్నప్పటికీ రాష్ట్రంలో చాలామంది మానసిక రుగ్మతలు థైరాయిడ్ వంటి సమస్యలతో బాధపడుతున్నారని గ్రామీణ ప్రాంతాల్లోని ప్రజలు శుద్ధిచేసిన అయోడిన్ ఉప్పులే వాడాలని తూర్పుగోదావరి జిల్లా పి.డి సుఖ జీవన్‌బాబు అన్నారు. అయోడిన్ ఉప్పు కూడా సూక్ష్మపోషకా హారం లాంటిదేనని పేర్కొన్నారు. ఇటీవల ప్రపంచ అయోడిన్ డిఫెషియన్సీ ప్రివన్స్‌డే కార్యక్రమాన్ని కాకినాడలో నిర్వహించారు. ఈ సందర్భంగా జరిగిన ర్యాలీని ఉద్దేశించి పి.డి మాట్లాడుతూ ఉప్పు తగినంత తీసుకోవడంవలన ఆరోగ్యంగా ఉంటారన్నారు. ముఖ్యంగా మహిళల్లో అయోడిన్ ఉప్పు వాడకం తక్కువ అయితే గర్భదారణ సమయంలో ఇబ్బందులు ఎదురవుతాయన్నారు. శారీరక పెరుగుదలను సైతం బలహీనపరుస్తుంది అన్నారు. అయోడిన్ లోపం మూలంగా లక్షమందిలో 287 మంది థైరాయిడ్ లోపంతో బాధపడుతున్నారన్నారు. అయోడిన్ క్షీణత కారణంగా చిన్నపిల్లల్లో కూడా రోగాలు వస్తాయన్నారు. అందు బాటులో ఉన్న ఆహారపదార్థాల్లో కూడా అయోడిన్ ఉంటుందని ఉదాహరణకి గోదావరి తీరప్రాంతాల్లో చేపలు విరివిగా దొరుకు తాయని వాటిలో చిన్న చేపలను భుజించటం వల్ల అయోడిన్ పెరుగుదల బాగుంటుందన్నారు. అయోడిన్ ఉప్పు వాడకంపై ఇటు ప్రభుత్వం అటు స్వచ్ఛంద సంస్థలు అనేక ప్రచార కార్యక్ర మాలు నిర్వహిస్తుందన్నారు. అంగన్‌వాడీ ఆశా కార్యకర్తలు గ్రామ స్థాయిలో అయోడిన్ వాడకంపై ప్రజల్లో అవగాహన కల్గించాల న్నారు. నేటి ఆధునిక యుగంలో మనిషి ఆరోగ్యాన్ని పరిరక్షించేం దుకు అమూల్యమైన అవకాశాలు ఉన్నాయని మునుపెన్నడూలేని రీతిలో జీవితకాలాన్ని జీవన ప్రమాణాన్ని పెంచే శాస్త్ర విజ్ఞానం వైద్య, ఆరోగ్య పద్ధతులు మనకు అందుబాటులోకి వచ్చాయని అయినప్పటికీ మంచి ఆరోగ్యం ఇప్పటికీ చాలా సమాజాలలో ప్రజలందరికి అందుబాటులో ఉండటంలేదని దానికి ప్రధాన కారణం మన ఆహారపు అలవాట్లేనని చెప్పారు. మనం తినే ఆహారంలో అన్ని రకాల పోషకాలు ఉండేలా చూసుకోవాలని అందుబాటులో చౌకగా లభించే ఆహారపదార్థాల్లో కూడా పోష కాలు ఉంటాయన్నారు. కార్యక్రమంలో వైద్య ఆరోగ్యశాఖ సిబ్బంది జిల్లా ఆహార పౌరసరఫరా సంస్థ అధికారులు, డీలర్లు, అంగన్‌వాడీ సిబ్బంది పాల్గొన్నారు. పట్టణంలో వీరు నిర్వహించిన ర్యాలీ అందరినీ ఆకర్షించింది.

**ఇప్పుడు 'అంగన్‌వాడీ వాయిస్'కి**
**ఆన్‌లైన్ ఎక్కౌంటు**
**ఆంధ్రాబ్యాంక్ 107111100001273**
**సి.ఆర్.ఆర్. బ్రాంచ్, ఏలూరు**
**ఐఎఫ్ఎస్ కోడ్ ANDB0001071**

# అమ్మా... నీకెందుకీ ఆత్మశిక్ష!

## మహిళల్లో పెరుగుతున్న ఆత్మహత్యలు

## యుక్త వయసులో, వివాహితల్లోనే అధికం



**ఒక సంతోషం..**

దేశంలో మహిళలు అనూహ్యమైన పురోగమనంతో నింగీనేలా అన్న తేడాలేకుండా అన్ని రంగాల్లోనూ అద్భుతాలు సాధిస్తున్నారు.

**కానీ అత్యంత విచారకర విషయం ఏమంటే..**

ప్రపంచవ్యాప్తంగా ఆత్మహత్యలకు పాల్పడి.. తమ జీవితాలను బలవంతంగా కడతేర్చుకుంటున్న మహిళలు కూడా మన దేశంలో ఎక్కువగానే ఉంటున్నారు!

ప్రపంచవ్యాప్తంగా ఆత్మహత్యలకు పాల్పడుతున్న మహిళల్లో 36.6% మంది మన దేశంలో ఉంటున్నారని తాజా గణాంకాలు స్పష్టం చేస్తుండటం ఆందోళనకరం. ప్రపంచ గణాంకాలతో పోల్చినప్పుడు మన దేశంలో ఆత్మహత్యలు, సంబంధిత మరణాలు గత పాతికేళ్లలో గణనీయంగా పెరిగాయి. ఈ మరణాలు మహిళల్లో మరీ ఎక్కువగా పెరుగుతున్నాయని.. 2016లో ప్రపంచవ్యాప్తంగా ఆత్మహత్యకు పాల్పడిన ప్రతి ముగ్గురు మహిళల్లో ఒకరు మన దేశంలోనే ఉన్నారని తాజాగా విఖ్యాత వైద్య పత్రిక లాన్సెట్ ప్రచురించిన అధ్యయనం విస్పష్టంగా నిగ్గుతేల్చింది. మొత్తంగా చూసినప్పుడు ఆత్మహత్యలు 15-39 ఏళ్ల మధ్య వయసు వారిలో ఎక్కువగా సంభవిస్తుండగా.. మహిళల విషయానికి వచ్చేసరికి వివాహిత స్త్రీలలోనే ఎక్కువగా నమోదవుతుండటం మరింత ఆందోళనకరం.

### ఆమెను కాపాడుకుందాం!

మన దేశంలో 2016లో నమోదైన ఎయిడ్స్ సంబంధ మరణాలు 62,000. ప్రసూతి మరణాలు 45,000. మనం ఇవే చాలా ఎక్కువ అనుకుంటున్నాం. కానీ ఆత్మహత్యా మరణాలు ఈ రెండింటికంటే కూడా చాలా ఎక్కువగా ఉంటున్నాయి. మనం ఆత్మహత్యల నివారణపై ప్రత్యేక శ్రద్ధ పెట్టాల్సిన అవసరం ఆసన్నమైందని చెప్పే గణాంకాలివి!

### ఇదీ హెచ్చరిక..!

ప్రపంచ జనాభాలో మన దేశ జనాభా 18%. కానీ.. ప్రపంచవ్యాప్తంగా ఆత్మహత్యలు చేసుకుని తమ జీవితాలను కడతేర్చుకుంటున్న మహిళల్లో 36.6% మంది మన దేశంలోనే ఉంటున్నారు. అలాగే పురుషుల్లోనూ 24.3% ఆత్మహత్యా మరణాలు మన దేశంలో నమోదవుతున్నాయి. ఇవీ తాజాగా ప్రఖ్యాత లాన్సెట్ పబ్లిక్ హెల్త్ పత్రిక ప్రచురించిన సమగ్ర అధ్యయనంలో వెలువడిన దిగ్భ్రాంతికర గణాంకాలు!

### ఏమిటీ అధ్యయనం ప్రత్యేకత?

జాతీయ నేర గణాంక విభాగం (ఎన్‌సీఆర్‌బీ) వివిధ నేరాలకు సంబంధించిన వివరాలతో పాటు దేశంలో ఆత్మహత్యల వివరాలు కూడా వెలువరిస్తుంటుంది. కానీ ఈ గణాంకాలన్నీ పోలీసు స్టేషన్లలో నమోదైన రిపోర్టుల మీద ఆధారపడినవి. కానీ ఆత్మహత్యల విషయంలో పోలీసు రికార్డుల కచ్చితత్వాన్ని పూర్తిగా విశ్వసించటానికి లేదన్న భావన బలంగా ఉంది. ఈ నేపథ్యంలో లాన్సెట్ ప్రపంచవ్యాప్తంగా రకరకాల వ్యాధుల భారం ఎలా ఉంటోందన్న దానిపై నివేదిక వెలువరిస్తూ.. మన దేశంలో ఆత్మహత్యల తీరుతెన్నులనూ సమగ్రంగా విశ్లేషించింది. గతంతో పోల్చుకున్నా.. అలాగే ఇతర దేశాలతో పోల్చుకున్నా కూడా మన దేశంలో మహిళల్లో ఆత్మహత్యలు గణనీయంగా పెరిగాయనీ ఇందులో తేలటం గమనార్హం.

### వివాహిత మహిళల్లోనే ఎక్కువ

వాస్తవానికి పెళ్లైన స్త్రీలు తన జీవితానికి మరింత భద్రత,



రక్షణ చేకూరిందని భావించాలి. కానీ మన దేశంలో గృహహింస, వేధింపులు, చిన్నవయసు పెళ్లిళ్లు, పెద్దలు కుదిర్చిన బలవంతపు పెళ్లిళ్లు, చిన్నవయసు కాన్పులు, ఆర్థిక ఇబ్బందుల వంటివన్నీ కలిసి మహిళలను ఆత్మహత్యలకు పురిగొల్పుతున్నాయని అధ్యయనంలో గుర్తించారు. మహిళలకు వెంటనే మానసిక వైద్యం అందుబాటులో లేకపోవటం కూడా సమస్యేనని పరిశోధకులు భావిస్తున్నారు.

## నేరం కాదు.. వ్యాధి!

ఆత్మహత్యను ఒక 'నేరం'గా కంటే కూడా ఒక 'వ్యాధి'గా గుర్తించాల్సిన అవసరాన్ని ఈ అధ్యయనం నొక్కి చెబుతోంది. ఈ దిశగా ఇప్పుడిప్పుడే కొన్ని సానుకూల పరిణామాలు చోటు చేసుకుంటున్నాయి. 2017లో రూపొందించిన మానసిక ఆరోగ్య బిల్లు ఆత్మహత్యను నేరంగా పరిగణించకూడదని ప్రతిపాదిస్తుండటం విశేషం.

## ఇప్పుడేం చెయ్యాలి?

### నమోదులో కచ్చితత్వం

ఆత్మహత్యా ప్రయత్నాలు, మరణాలను నమోదు చేసే విషయంలో కచ్చితత్వం ఉండటం లేదు. ఈ దిశగా ప్రభుత్వం తక్షణం చర్యలు తీసుకోవాలి. పోలీసు గణాంకాలే కాకుండా స్వీయ హాని, ఆత్మహత్యా ప్రయత్నాలతో వైద్యుల వద్దకు వస్తున్న కేసులనూ నమోదు చేసేందుకు కచ్చితమైన విధానం ఉండాలి.

### ఆమె మీద శ్రద్ధ

అంతర్జాతీయంగా ఆత్మహత్యల సరళిని పరిశీలిస్తే- ఇతర దేశాల్లో కంటే భారత్‌లో మహిళా ఆత్మహత్యలు ఎక్కువగా నమోదవుతున్నాయి. కాబట్టి కచ్చితంగా మహిళల మీద ప్రత్యేక శ్రద్ధ పెట్టాలి.

### యుక్తవయసులో పట్టుకోండి

ఆత్మహత్యలు యుక్తవయసు వారిలో ఎక్కువగా కనబడుతుండటం ఆందోళనకరం. స్త్రీలలో అయితే ఇటు యుక్తవయసు, అటు వృద్ధాప్యంలోనే ఎక్కువగా సంభవిస్తున్నాయి. కాబట్టి ఈ వయసులో వీళ్లు ఎదుర్కొంటున్న సమస్యలేమిటో ప్రత్యేకించి గుర్తించాలి.

### రాష్ట్రాల వారీగా ప్రణాళిక

ఆత్మహత్యల తీరుతెన్నులు ఒకో రాష్ట్రంలో ఒక్కో రకంగా ఉంటున్నాయి. అందుకు దారి తీస్తున్న కారణాలూ మారిపోతున్నాయి, కాబట్టి ఆత్మహత్యల నివారణకు ఒక జాతీయ విధానంతో పాటు రాష్ట్రాల వారీగా కూడా ప్రణాళికలుండాలి.

### రైతు సమస్యలతో పాటు..

పురుషుల దగ్గరకు వచ్చేసరికి దేశవ్యాప్తంగా రైతుల ఆత్మహత్యల గురించే చర్చ ఎక్కువ జరుగుతోంది. అది అవశ్యకమే గానీ రైతు సమస్యలతో పాటు మద్యానికి బానిసలు కావటం, మానసిక సమస్యల వంటివీ ఆత్మహత్యలకు పురిగొల్పుతున్నాయి. వీటిపైనా దృష్టి పెట్టాలి.

### అందరిదీ బాధ్యత

ఆత్మహత్య మానసిక సమస్యేగానీ మూలాలు సమాజంలోనూ ఉంటాయి. కాబట్టి ఈ వార్తల విషయంలో మీడియా బాధ్యతాయుతంగా వ్యవహరించటం, పురుగు మందుల వంటివి సులభంగా అందుబాటులో లేకుండా చూడటం వంటి చర్యలూ కీలకమే.

# సామాజిక అంశాలపై అవగాహన అవసరం

బాలికలు చదువుతోపాటు సామాజిక అంశాలపై అవగాహన కలిగి వుండాలని కృష్ణాజిల్లా న్యాయసేవాధికార సంస్థ కార్యదర్శి పీఆర్ రాజీవ్ అన్నారు. కృష్ణా విశ్వవిద్యాలయ క్యాంపస్ కళాశాలలో ఇటీవల బాలికా దినోత్సవాన్ని పురస్కరించుకుని న్యాయ విజ్ఞాన సదస్సు నిర్వహించారు. ఈ సందర్భంగా పాల్గొన్న ఆయన మాట్లాడుతూ బాలికలు మానసిక దృఢత్వాన్ని పెంపొందించుకోవాలని, ఎలాంటి సమస్య వచ్చినా ధైర్యంగా ఎదుర్కొనేలా ఉండాలన్నారు. చట్టాల గురించి తెలిసి ఉంటే చాలా సమస్యలను సులువుగా పరిష్కరించుకోవచ్చని చెప్పారు. బాలికలకు అండగా అనేక చట్టాలు ఉన్నాయని, వాటిపై అవగాహన పెంపొందించుకోవాలన్నారు. అనంతరం బాలికల సంరక్షణకు ఉన్న చట్టాల గురించి వివరించారు. అపరిచిత వ్యక్తుల పట్ల అప్రమత్తంగా వుండాలని, అలాంటి వ్యక్తులు కనిపిస్తే పోలీసులకు సమాచారం అందించాలన్నారు. బాల్యవివాహాలు చట్టరీత్యా నేరమని, వాటిని ప్రోత్సహించినవారిపై కూడా చట్టపరంగా చర్యలు తీసుకుంటారని అన్నారు. అలాంటి వివాహాలు జరిగితే ఐసీడీఎస్ అధికారులకు లేదా పోలీసులకు సమాచారం అందించాలన్నారు. లైంగిక దాడులకు అడ్డుకట్టవేయడానికి ఫోక్సో చట్టం అందుబాటులో ఉందన్నారు. విద్యార్థులకు ఉచిత న్యయసహాయం అందిస్తున్నందున వినియోగించుకోవాలని కోరారు. అధ్యాపకులు విజయలక్ష్మి, శ్రావణి, పలువురు విద్యార్థులు పాల్గొన్నారు.

మినీ అంగన్‌వాడీ వర్కర్లకు పదేళ్ళు సర్వీసు పూర్తయితే కార్యకర్తగా పదోన్నతి ఇవ్వవచ్చునని తెలిపే ప్రభుత్వ ఉత్తర్వులు. అయితే ఈ జీవోలో గ్రామంలో ఉన్న మినీ వర్కర్ పదేళ్ళు పనిచేయాలని, అప్పుడే పదోన్నతి అని సూచించారు. కాగా ఆ గ్రామంలో ఒకేఒక మినీ అంగన్‌వాడీ సెంటర్ ఉంటే ఆ వర్కర్‌కు ఎప్పటికి పదోన్నతి వస్తాదో అధికారులు గ్రహించాలి. అలాకాకుండా గ్రామపంచాయతీ పరిధిలో అని ఇస్తే బాగుండును.

File No.WDC02-16030/63/2018-ICDS-WD&CW
File No.WDC01-13/86/2018-PROGS I SEC-WCD&SC

GOVERNMENT OF ANDHRA PRADESH
DEPTT., FOR WOMEN, CHILDREN, DIFFERENTLY ABLED & SENIOR CITIZENS

eMemo.No 13034/86/2018/Prog I/A2, Dt 28/09/2018

| | |
|---|---|
| Sub:- | W.D.& C.W. – Anganwadi Services Scheme under Umbrella ICDS – Promotion of Mini Anganawadi Worker (Mini AWW) as Anganwadi Worker (AWW) –Permission-Reg |
| Ref:- | 1. G O Ms No.21, WD, CW, DW, Dept Dt 24 08 2007<br>2. G.O Ms. 38, Women development, Child Welfare and Disabled Welfare Dept. Dt 03.11.2008<br>3. G.O.Rt No. 102 Dept for WCD&SC, Dated 28 03.2011<br>4. G.O.Ms No 18, Dept., for WCDA & SCs, dated 15-05-2015<br>5. From the Special Commissioner, W.D & C.W., Guntur Letter No. 16039/9/2018-ICDS-WD&CW, dt.16-07-2018.<br>6. From the Special Commissioner, W D. & C.W., Guntur Letter No. 16037/9/2018-ICDS-WD&CW, dt.08-08-2018. |

*****

In the circumstances reported in the references 5th and 6th cited by the Special Commissioner, W.D. & C.W., Guntur, and Government,after careful examination of the matter, hereby accord permission to the Special Commissioner, WD & CD, Guntur to consider the promotion for Mini-Anganwadi Worker (Mini-AWW) as Anganwadi Worker (AWW) who is from the same village where the vacancy has arisen and have put in minimum ten (10) years of satisfactor service and also possess the requisite qualifications (Age, Education etc , )

2. The Special Commissioner, W D. & C.W., Guntur, is requested to take further necessary action accordingly,duly following the procedure and rules.

H.ARUN KUMAR, SECY(HAK), O/o SECRETARY-WCD&SC

To
The Special Commissioner,
Women Development and Child Welfare Department,
(A.P.,) Guntur.
Copy to:
All the District Collectors in the State.
All the P.Ds., DW&CDA in the State.
The Govt. Pleader for WD&CW (AP),
High Court, Hyderabad.

//FORWARDED :BY: ORDER//

SECTION OFFICER.



ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

## మహిళాభివృద్ధి శిశు సంక్షేమ శాఖ

## సర్క్యులర్ మెమో /16028 /25/S N P /తేది: 11/09/2018

విషయం : అంగన్ వాడీ కేంద్రాల పనితీరు పర్యవేక్షణ మరియు తగిన మద్దతు అందించడానికి ALMSC కమిటీల పునరుద్ధరణ కొరకు తగిన సూచనలు జారీచేయుట – గురించి.

సూచిక

1. G.O.Ms.No.38, తేది: 21.12.2012 మహిళాభివృద్ధి శిశు సంక్షేమ, వయోవృద్ధుల, విభిన్న ప్రభావంతుల సంక్షేమ శాఖ ద్వారా ఇచ్చిన మార్గ దర్శనాలు
2. గౌరవ శాసన సభ నందు అంగన్ వాడీ పర్యవేక్షణ గురించిన చర్చపై ప్రభుత్వ పరమైన హామీ తేది : 10. 09.2018.

****

పైన పేర్కొన్న సూచిక (i) ననుసరించి ప్రభుత్వం అంగన్ వాడీ కేంద్రాల ద్వారా మహిళలు, పిల్లల పోషణకు సంబంధించి అందుతున్న సేవలు పర్యవేక్షించడానికి, తగిన మద్దతు అందిచడానికై రాష్ట్ర, జిల్లా,ICDS బ్లాక్ స్థాయి మరియు అంగన్ వాడీ కేంద్రాల స్థాయిలో కమిటీలను ఏర్పాటు చేయడం జరిగినది. అలాగే ఈ కమిటీల విదివిదానాలను కూడా సూచించడం జరిగినది.

ఈ సందర్భంగా పైన పేర్కొన్న సూచిక (ii) ననుసరించి ప్రభుత్వ ఆదేశాల మేరకు అంగన్ వాడీ స్థాయి మానిటరింగ్ మరియు మద్దతు కమిటీ (ALMSC) ని ప్రతీ అంగన్ వాడీ కేంద్రం స్థాయిలో ఏర్పాటుచేసి మానిటరింగ్ జరిగేలా తగిన చర్యలను వెంటనే చేపట్టాలని అన్ని జిల్లాల ICDS ప్రాజెక్టు డైరెక్టర్లను ఆదేశించడం జరిగింది. ALMSC లను ఏర్పాటు చేయడం మరియు ప్రతినెలా ఈ కమిటీలు సమావేశం జరగడం, ఈ కమిటీలు తీర్మానాలు, మినిట్స్ రికార్డు చేయడం తప్పనిసరి. ALMSC కమిటీ సభ్యులు మరియు కమిటీ విది విదానాలు ఈ క్రింద పేర్కొనడం జరిగింది

**అంగన్ వాడీ స్థాయి మానిటరింగ్ మరియు మద్దతు కమిటీ (ALMSC)**

| సం. | సభ్యులు | స్థాయి | రిమార్కులు |
|---|---|---|---|
| 1. | గ్రామ పంచాయతి స్పెషల్ ఆఫీసర్ | చైర్ పర్సన్ | స్థానిక సంస్థలు మళ్ళీ ఏర్పాటు అయ్యే వరకూ స్పెషల్ ఆఫీసర్ చైర్ పర్సన్ గా వ్యవహరించాలి |
| 2. | మహిళా మండలి నుండి ఇద్దరు సభ్యులు (రొటేషన్ పద్దతి లో) | సభ్యులు | సాదికార మిత్రలలో యాక్టివ్ సభ్యులను బాగస్వామ్యులుగా చేయవచ్చు |
| 3. | ASHA | సభ్యులు | - |
| 4. | కమ్యూనిటీ బేస్ట్ ఆర్గనేజేషన్ (CBO) సభ్యులు (ఇద్దరు) | సభ్యులు | SHG సభ్యులు /స్వచ్ఛంద సేవా సంస్థల సభ్యులు |
| 5. | కమ్యూనిటీ నుండి (3 సభ్యులు) (ఉపాధ్యా యులు, పదవీ విరమణ పొందిన ప్రభుత్వ అదికారులు, అంగన్ వాడీ ప్రీస్కూల్ కు వచ్చే పిల్లల తల్లిదండ్రులు) | సభ్యులు | - |
| 6. | సబల కార్యక్రమం నుండి సభ్యులు | సభ్యులు | గ్రామంలో యాక్టివ్ గా ఉన్నటువంటి కిషోర బాలిక ఒకరిని బాగస్వాములు గా చేయవచ్చు |
| 7. | అంగన్ వాడీ కార్యకర్త | కన్వీనర్ | |

**సూచనలు:**

- ఈ కమిటీ ప్రతి నెలా అంగన్ వాడీ/గ్రామ/వార్డు స్థాయి లో మీటింగ్ పెట్టుకుని, మీటింగ్ మినిట్స్ రికార్డు చేసి, మినిట్స్ కాపీ ని సంబందిత CDPO కి ఒక కాపీ ఇవ్వాలి
- అవసరం అనుకుంటే ICDS సూపర్ వైజర్, ANM, LHV లను ఈ సమావేశానికి ఆహ్వానించవచ్చును

**కమిటీ బాద్యతలు**

అంగన్ వాడీ స్థాయి మానిటరింగ్ కమిటీ అంగన్ వాడీ కేంద్రం ద్వారా అమలవుతున్న సేవలపై రివ్యూ చేసి తగిన సలహాలు, సూచనలు ఇవ్వాలి

1. అంగన్ వాడీ ప్రతిరోజు పనిచేస్తోందా లేదా చర్చించాలి.
2. అంగన్ వాడీ ద్వారా సర్వే చేసిన జనాబాలోని అర్హులైన మహిళలు, పిల్లలు అంగన్ వాడీ కేంద్రంలో నమోదు అయ్యారా లేదా చూడాలి
3. అంగన్ వాడీ కేంద్రంలో పేరు నమోదు చేసుకున్న లబ్దిదారులకు అందరికీ నిర్దేశించిన పోషకాహారం గతనెలలో కనీసం 21 రోజులు అందాయా లేదా చూడాలి



4. 3సం లోపు, 3-6 సం లోపు పిల్లల ఎదుగుదల పర్యవేక్షణ రికార్డు పరిశీలించాలి. లోప పోషణ కోసం ఎటువంటి మద్దతు అందుతోందో అనే విషయాలపై చర్చించాలి
5. ప్రీ-స్కూల్ కార్యక్రమాలు ఎలా అమలు చేస్తున్నారు, ప్రీ-స్కూల్ నిర్వహణ కోసం అందించిన మెటిరియల్ ఎలా వాడుతున్నారో చూడాలి, అలాగే తల్లితండ్రులతో సమావేశం నిర్వహిస్తున్నారా లేదా అడిగి తెలుసుకోవాలి, రికార్డు చేయాలి
6. ప్రతినెలా VHSNC సమావేశం జరుగుతోందా? అంగన్ వాడీ కార్యకర్తలు ఈ సమావేశం లో పాల్గొంటున్నారా గమనించాలి
7. VHSNC సమావేశం ప్రతినెలా జరిగేలా తగిన మద్దతు అందించాలి, ఆ సమావేశానికి తగిన సహకారం అందించాలి. ఈ కమిటీలోని కనీసం ఒక సభ్యుడు హాజరవ్వాలి. ( AWW లో కలిపి)
8. అంగన్ వాడీ కేంద్రంలో వసతులు: అంటే తాగునీరు, కరెంటు, టాయిలెట్, ఆటస్థలం, ప్రీ-స్కూల్ కిట్, మెడిసిన్ కిట్, వంట సామగ్రి మొదలైనవి ఉన్నాయా లేదా చూడాలి రికార్డు చేయాలి
9. అంగన్ వాడీ కేంద్రానికి చేరాల్సిన పోషకాహార సరుకులు, సక్రమంగా అందుతున్నాయా? వాటి వాడకం ఎలా ఉంది పర్యవేక్షించాలి. సరుకుల పంపిణీ, నిల్వలలో ఎవైనా లోటుపాట్లు గమనించినట్లైతే మినిట్స్ లో రికార్డు చేయాలి
10. స్థానికంగా AWW లేదా AWC కి సంబందించిన వివాదాలు ఏమైన వుంటే వాటిని జాగ్రత్తగా పరిష్కరించాలి. అలా చేయలేని పక్షంలో ఆ వివాదాలను గ్రామ పంచాయితీకి లేదా బ్లాక్ పర్యవేక్షణ కమిటీ వారి దృష్టికి తీసుకువెళ్ళాలి
11. అంగన్ వాడీ కేంద్రంలో అందుతున్న సేవల్లో ఏవైనా లోటుపాట్లు గమనిస్తే అంగన్ వాడీ కార్యకర్త, సూపర్ వైజర్ తో మాట్లాడి ఆ లోటుపాట్లు సరిదిద్దటానికి తగిన సూచనలు, మద్దతు అందించాలి. కమిటీ పరిష్కరించడానికి వీలులేని అంశాలు ఏవైనా ఉంటే పై అదికారుల దృష్టికి తీసుకెళ్ళాలి.
12. అంగన్ వాడీ కేంద్రం ద్వారా అందుతున్న సేవలలో ఇంకేవైనా విషయాలు గమనించి ఉంటే అట్టి విషయాలు కూడా చర్చించి రికార్డు చేయాలి

<u>గమనించాల్సిన విషయాలు</u> :

పైన పేర్కొన బాద్యతలను నిర్వర్తించడానికి :

- కమిటీ సభ్యులు ICDS కార్యక్రమం పై పూర్తి అవగాహన కలిగి ఉండాలి
- ICDS విది విదానాలు, కార్యక్రమాల పై పూర్తి సమాచారం, అమలు జరిగే విదానం గురించి పూర్తి వివరాలు తెలుసుకోవాలి
- వీలు కలిగినప్పుడల్లా అంగన్ వాడీ కేంద్రం సందర్శించాలి, కమ్యూనిటీ తో మరియు లబ్దిదారులతో మాట్లాడి విషయాలు తెలుసుకోవాలి
- అంగన్ వాడీ ద్వారా MPR వివరాలు క్రోడీకరించి పై అదికారులకు అందించిన తదుపరి, ALMSC కమిటీ సమావేశం నిర్వహించేలా చూసుకొని, అట్టి సమావేశానికి హాజరవ్వాలి. అంగన్ వాడీ సేవల పై చర్చించి తగిన సలహాలు, మద్దతు ఇవ్వాలి
- ప్రతి నెలా సమావేశం అయిన తర్వాత మినిట్స్ కాపీ ని CDPO/బ్లాక్ లెవెల్ కమిటీ కి అందించాలి
- అంగన్ వాడీ సేవలకు సంబంధించిన మార్గదర్శకాలు, ఉతర్వులను అనుసారంగా సమావేశంలో చర్చించిన అంశాల పై తగిన నిర్ణయాలను తీసుకొనవచ్చును. ఏవైనా పరిష్కరించలేని అంశాలుంటే పై స్థాయి (బ్లాక్ స్థాయి) కమిటీ వారి దృష్టికి తీసుకెళ్ళవచ్చును
- అంగన్ వాడీ కార్యక్రమాలు అడ్డుకోకుండా ఉండేలా కమిటీ సమావేశం తగిన సమయాన్ని నిర్దేశించుకోవాలి.

పైన పేర్కొన్న విదంగా ప్రతి అంగన్ వాడీ కేంద్రం పరిదిలో ALMSC ని ఏర్పాటు చేసి ప్రతినెల కమిటీకి తగిన మద్దతు అందించుచూ అంగన్ వాడీ సేవలను పర్యవేక్షించే లా CDPO లు తగిన శ్రద్ధ తీసుకోవలెను. ప్రతినెలా CDPO లు అంగన్ వాడీ కార్యకర్తల హాజరు రిపోర్ట్ ను సంచాలకులకు పంపేటప్పుడు:

1. ALMSC మీటింగ్ నిర్వహించినది
2. మహిళా శిశు దర్శని గ్రామ పంచాయితిలో పెట్టినది తప్పనిసరిగా నిర్ధారించవలెను

**H.ARUN KUMAR**
**SPECIAL COMMISSIONER**

# విజయదశమి శుభాకాంక్షలు

# అభివృద్ధిపథంలో ఏలూరు నగర పాలక సంస్థ

శ్రీ నారా చంద్రబాబునాయుడు గారు
ముఖ్యమంత్రి వర్యులు

శ్రీ కె. నారాయణ గారు
మున్సిపల్ శాఖామాత్యులు

శ్రీ మాగంటి వెంకటేశ్వరరావు (బాబు) గారు
ఏలూరు పార్లమెంటు సభ్యులు

శ్రీ బడేటి కోట రామారావు (బుజ్జి) గారు
ఏలూరు శాసనసభ్యులు

శ్రీమతి షేక్ నూర్జహాన్ పెదబాబు గారు
మేయర్, ఏలూరు నగర పాలక సంస్థ

ఏలూరు నగర ప్రజలకు,
ప్రజాప్రతినిధులకు,
అధికారులకు, నగర మేయర్
**శ్రీమతి షేక్ నూర్జహాన్ పెదబాబు గారికి,**
పాలకవర్గానికి, పాలకవర్గ సిబ్బందికి
**విజయదశమి శుభాకాంక్షలు**

సకాలంలో పన్నులు చెల్లించండి...
నగరాభివృద్ధికి తోడ్పడండి

## ఎ. మోహనరావు
కమిషనర్
నగర పాలక సంస్థ, ఏలూరు

BCI

OCTOBER 2018 RNI APTEL 2016/71924, Postal Licence : SP/ELR/02/2017-19

# పదవీ విరమణ శుభాకాంక్షలు



మహిళా స్త్రీ శిశు సంక్షేమశాఖలో 24 ఏళ్లపాటు
వివిధ హోదాల్లో ఉద్యోగ బాధ్యతలు నిర్వర్తించి
రీజనల్ జాయింట్ డైరెక్టర్ హోదాలో పదవీ విరమణ చేసిన

## శ్రీమతి కె. శ్యాంసుందరి గారికి

ఇవే మా శుభాకాంక్షలు..

## కర్నూలు ఐసిడిఎస్ ప్రాజెక్టు

| | | |
|---|---|---|
| **వి. లీలావతి**<br>ప్రాజెక్టు డైరెక్టర్, కర్నూలు | **పి. విజయ**<br>అడిషనల్ ప్రాజెక్టు డైరెక్టర్, కర్నూలు | **ఎం. మాడమ్మ**<br>సిడిపివో (ఎఫ్ఎసి), ఆలూరు |
| **ఎస్. సఫరున్నీసా బేగం**<br>సిడిపివో, ఆదోని అర్బన్ | **అంజనీ భూషణ**<br>సిడిపివో, ఆదోని రూరల్ | **ఉమా మహేశ్వరి**<br>సిడిపివో (ఎఫ్ఎసి), ఆళ్ళగడ్డ |
| **లావణ్య**<br>సిడిపివో, ఆత్మకూరు | **భవాని**<br>సిడిపివో, బనగానపల్లి | **టి.ఆర్.ఎం. చంద్రకళ**<br>సిడిపివో, డోన్ |
| **ఉమామహేశ్వరి**<br>సిడిపివో, కొడుమూరు | **డి. విజయలక్ష్మి**<br>సిడిపివో, కోయలకుంట | **జి. వరలక్ష్మి**<br>సిడిపివో, కర్నూలు రూరల్ |
| **వరలక్ష్మి దేవమ్మ**<br>సిడిపివో, కర్నూలు అర్బన్ | **ఎస్. కోటేశ్వరి**<br>సిడిపివో, నందికొట్కూరు | **లీలావతిదేవి**<br>సిడిపివో, నంద్యాల రూరల్ |
| **ఆగ్నేష్ యాంజిల్**<br>సిడిపివో, నంద్యాల అర్బన్ | **పి. విజయ**<br>సిడిపివో, పత్తికొండ | **పి. నాగమణి**<br>సిడిపివో, ఎమ్మిగనూరు |
| **రమణమ్మ**<br>ఎసిడిపివో, ఆత్మకూరు | **ఎం. మాడమ్మ**<br>ఎసిడిపివో (రెగ్యులర్), డోన్ | **సుజాత**<br>ఎసిడిపివో, కర్నూలు రూరల్ |
| **ఉమామహేశ్వరి**<br>ఎసిడిపివో (రెగ్యులర్), కోయిలకుంట్ల | **సావిత్రి దేవి**<br>ఎసిడిపివో, పత్తికొండ | **అశ్వత**<br>ఎసిడిపివో, ఎమ్మిగనూరు |



**మనము ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | **KRSA101M101** |
| పుస్తకం పేరు | అంగన్ వాడి |
| తారీఖు | **23 February 2025** |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | No |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Vedavathi |
| పేజీలు విడదీసినది | Vedavathi |
| స్కాన్ చేసినది | Sharmila |
| పరీక్ష చేసినది | hema |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |